ధరఁ జల్లార్పఁగ లేని జ
ఠరాగ్నియగు దానిచే నెడంగెడలంగన్. 39

కం॥ దానికి నిందిియసమితియు
మానసమును మఱియు బుద్ధి మనికి కిరీటీ
జ్ఞానమును వీనితోడను
మానుగఁ గప్పి యది దేహి మరులు కొలుపుఁజూ. 40

కం॥ అదికావున నిందిియముల
మొదల గెలిచి పిదప భరతముఖ్యా జ్ఞాన
ంబదిరా విజ్ఞానంబును
జదిపెడు నలపాపురాలిఁ జంపుము వేగన్. 41

కం॥ బలవంతము లిందిియములు
బలవంతంబులుతకంటె వసుధ మనం బౌ
నలమనముకంటె బుద్ధియ
బలవంతము బుద్ధికంటె బలవంతమదే. 42

ఉత్సాహ॥ ఇటుల బుద్ధికంటె బలిమి నెక్కుడౌట యెఱిఁగి యీ
వెటులనైన బుద్ధిచే జయించి మానసంబు నో
నిటలనేత్రవినుతశౌర్య నిజము గెల్వఁ గష్టమౌ
చటుల కామరూపవైరిఁ జయ్యఁ గూల్పు మాపవే. 43

గద్య.

ఇది శ్రీ త్రికవిమిత్ర తాడూరి రామనభట్టాగ్రపుత్ర పండితా
రాధనమండిత లక్ష్మీనరసింహ పండిత ప్రణీతంబైన
యుపనిషత్తును బ్రహ్మవిద్యయును యోగశా
స్త్రంబును శ్రీ కృష్ణార్జునసంవాదంబు
ను నగు శ్రీ భగవద్గీత
యందుఁ గర్మయో
గంబనుతృతీయా
ధ్యాయము.



# నాలుగవయధ్యాయము.

## జ్ఞానయోగము.



అని చెప్పి మఱియు శ్రీభగవంతుండిట్లనియె.

కం॥ ఎఱుఁగఁగ బోధించితి ముం
దఱ నీస్థిరయోగవిద్యఁ దగ సూర్యునకున్
గఱపెను సూర్యుఁడు మనువున
కెఱిఁగించెను మనువు దీని నిక్ష్వాకునకున్. 1

కం॥ ఈవిధమునను బరంపర
గా వచ్చిన దీనిఁ గొనియెఁ గన్వడి రాజ
ర్ష్యావలి చిరకాలమగుటఁ
దా విచ్ఛిన్నమయిపోయె ధర సదియకటా. 2

కం॥ ఆయీపురాతనంబై
యే యెప్పెడు యోగ మిప్పు డిచ్చితి నీకే
నోయర్జున చెలి భక్తుఁడ
వై యొప్పితి విది పరమరహస్యము సువ్వే. 3

4 జ్ఞానయోగము.

ఇట్లు చెప్పుటయు నర్జునుండు

ఆ॥ వె॥ నిన్నగాక మొన్న నీవు పుట్టినవాఁడ
వెన్నియుగము లయ్యె నినుఁడుపుట్టి

కాన మొదల వానిఁ గఱపితి వనుమాట
యెట్లెఱుంగువాఁడ నేను గృష్ణ. 4

అనియడుగుటయు శ్రీభగవంతుఁడిట్లనియె.

కం॥ నాకును నీకును దలఁప న
నేకమ్ములు జన్మములయ్యె నే నెఱుఁగుదుఁ జు
మ్మీ కవ్వడి యవి యెవ్వియు
నీ కెఱుఁగఁగరాదు శత్రునికరవిదారీ. 5

ఆ॥ వె॥ అజుఁడ నైన నవ్యయాత్ముఁడ నైన భూ
తేశ్వరుండ నైన నిందు నాదు
ప్రకృతిఁ జేతఁ బట్టి పౌరవబాలకా
యవతరించువాఁడ నాత్మమాయ. 6

తే॥ గీ॥ ఎప్పుడెప్పుడు ధర్మంబు హీనమౌచు
ధర్మమభివృద్ధి యగుచుండు ధరణిలోన
నప్పుడప్పుడు శత్రుసంహారధుర్య
నన్ను నేను బుట్టించుచున్నాఁడఁ జువ్వె. 7

కం॥ రక్షింపఁగ సజ్జనులను
శిక్షింపఁగ దుష్టజనుల నేమమెలర్పన్
వీక్షింప ధర్మ మాహవ
దక్షా నేనవతరింతుఁ దగ యుగయుగమున్. 8

కం॥ నాదివ్యజనియుఁ గర్మముఁ
దాఁ దెలిసెడు నిట్టివని యథార్థముగా నేఁ
డీదేహాంతంబున వాఁ
డే దేహము గనక నన్ను నే తగఁ బొందున్. 9

కం॥ అనురాగము క్రోధము భయ
ము నేది మన్మయుల యగుచుఁ బొనరఁగ నన్నుఁ గొ
ల్చినజ్ఞానతపశ్శుద్ధులు
మనుజోత్తము పొందినారు మద్భావంబున్. 10

కం॥ ఎవ్వ రుపాసింతురు నను
నెవ్విధమున న ట్లనుగ్రహింతును నిత్యం
బెవ్వ రిట నెన్ని త్రోవలు
కవ్వడి త్రొక్కినను నాదె కలసెదరు సుమీ. 11

ఆ॥ వె॥ కర్మఫలముసిద్ధి గాంక్షించు జను లిందు
సేవసేయువారు దేవతలను
మనుజలోకమందు ననఘ చేకురుఁ గాదె
కర్మఫలము శీఘ్రకాలముననె. 12

కం॥ ఇల గుణకర్మవిభాగం
బుల వర్ణచతుష్టయంబు పుట్టించితి నే
నలిదానికర్తనైనను
నల యవ్యయుఁడను నకర్తనంచు నెఱుఁగుమా. 13

కం॥ ననుఁగర్మము లెవి యంటవ
విను గర్మఫలంబులందు వేడుకపడఁబో
వ నిటుల నాగతి నెఱిఁగెడు
ఘనుండు బద్ధుండు గాఁడు కర్మంబులచేన్. 14

కం॥ అన్న యిటు లెఱిఁగి చేసిర
మున్ను ముముక్షువులు పైతముం గర్మంబుం
బన్నుగ మున చేయంబడి

యున్న యనాదియగుకర్మ మొనరుపు మీావున్. 15

కం॥ ఎయ్యదికర్మ మకర్మం
బెయ్యది యనుదీన భ్రమవహింతురు కవులే
యెయ్యది యెఱిఁగిన మోక్షం
బయ్యా నీకగు వచింతు నలకర్మంబున్. 16

కం॥ కర్మవిధమెఱుఁగ నలయు వి
కర్మవిధం బెఱుఁగునది యకర్మవిధము ని
ర్మర్మా కర్మ వికర్మపు
మర్మము లెఱుఁగంగరాదు మనుజున కవనిన్. 17

తే॥ గీ॥ కర్మమందు నకర్మ మకర్మమందుఁ
గర్మ మెవ్వాఁడు చూడంగఁ గలుగు ధరణి
వాఁడెబుద్ధిమంతుఁడు యోగివాఁడె వాఁడె
యన్నికర్మముల్ సలిపిన యట్టివాఁడు. 18

ఆ॥ వె॥ ఎవనికర్మనమితి యిలఁగామసంకల్ప
వర్జితమ్మయగుచు వఱలుచుండు
జ్ఞానవహ్నిదగ్ధసర్వకర్ముండైన
యతనిఁ బండితుండటండ్రు బుధులు. 19

కం॥ వీసము కర్మఫలంబుల
కాసపడక యెపుడు తనిసి యాశ్రయసమితిం
బాసి నరుఁడు కర్మంబులఁ
జేసినవాఁడైన నెదియుఁ జేయనివాఁడే. 20

కం॥ చన విడిచి కోర్కులను మన
మును దను నిలిచి మమకారము నుడిగికర్మం

బును గేవలశారీరం
బును జేయఁగ నరుఁడు పాపముం బొరయఁడుచూ. 21

క౦॥ తన కడుఁగ కబ్బులాభం
బునఁ దనిసి కిరీటి ద్వంద్వములఁ బడక చలం
బునుడిగి వచ్చినఁ రాకు
న్నను సరే యనునరుఁడుకూడ నలిముక్తుండే. 22

॥తే గీ॥ సంగముత్యజించి ముక్తుండై జ్ఞానమందు
స్థిరముగా నిల్చి యజ్ఞునాచిర్చ మొల్ల
భగవదర్థంబు పనిచేయు వానికైన
యట్టికర్మ మడంగు సమగ్రముగను. 23

తే॥ గీ॥ బ్రహ్మమే యజ్ఞపాత్రమ్ము బ్రహ్మమే న
రా హవిస్సును నగ్ని హోత్రమ్ము బ్రహ్మ
బ్రహ్మమే హోత హుతమును బ్రహ్మమనని
బ్రహ్మకర్మసమాధికి ఫలము బ్రహ్మ. 24

క౦॥ కొందఱు యోగులు సలుపుచు
నుందురు ధర దైవయజ్ఞ మొసరఁగ యోగుల్
కొందఱు యజ్ఞము బ్రహ్మా
గ్నిం దగ యజ్ఞమున వేల్చి నెగడెడువారల్. 25

క౦॥ కొందఱు శ్రోత్రాదీంద్రియ
బృందంబుల నిగ్రహాగ్ని వేల్తురు వేల్తుర్
చందముగ నింద్రియాగ్నులఁ
గొందఱు శబ్దముఖవిషయకోటిం బార్థా. 26

కం॥ అనఘా వేల్చుచునుందురు
చన జ్ఞానోద్దీపితాత్మసంయమయోగా
గ్నిని బ్రాణకర్మముల ఫ
లుగ యింద్రియకర్మములను గొందఱు సువ్వే. 27

ఉ॥ కొందఱు ద్రవ్యయజ్ఞమును గొందఱిలం దగ యోగయజ్ఞముం
గొందఱు వేదయజ్ఞమును గొందఱు తాము తపంబుయజ్ఞముం
గొందఱు జ్ఞానయజ్ఞమును గోరికఁ జేయుచు నుండువార లీ
యందఱుఁజూడఁగా మిగుల యత్నముసేసెడు సంశితవ్రతుల్. 28

కం॥ ప్రాణాయామముపట్టెడు
మానవులగుకొంద ఱిందు మానుగఁ బ్రాణా
పానగతుల నిలుపుచు నొక
దానిపనుల వేల్తు రొక్కదాని పనులలోన్. 29

కం॥ మితభోజనులై కొందఱు
క్షితిఁబ్రాణముఁ బ్రాణమందుఁ జేరిచి కుంతీ
సుత వేల్తురు వీరెల్ల వి
దితయజ్ఞులు యజ్ఞములను దీఱుఁ దదఘముల్. 30

తే॥ గీ॥ యజ్ఞశేషాన్నమును గుడ్చునట్టి యెల్ల
వారు శాశ్వతబ్రహ్మంబుఁ బడయువారు
యజ్ఞమొక్కటి చేయనియట్టివాని
కిహములే దట్టిచోఁ బర మేడఁగలదు. 31

కం॥ పలుఁదెఱఁగులైన యజ్ఞం
బు లనేకము లిట్లు బ్రహ్మముఖమున వ్యాప్తం

బులు వానినెల్లఁ గర్మజ
ములని యెఱుఁగు మెఱిఁగితేని ముక్తుఁడవు సుమీ. 32

కం॥ ద్రవ్యమయ యజ్ఞమునకంటె ధరణిలోన
జ్ఞానయజ్ఞము మేలు సూ సవ్యసాచి
సర్వకర్మముల్ విసుము నాశనముగాక
జ్ఞానమందున నిక్కము లీనమగును. 33

ఆ॥ వె॥ దాని నెఱిఁగికొనుము తత్త్వవేత్తలఁ జేరి
వారి కెఱిఁగి పరమభక్తి సేవ
సలిపి యడిగికొనుము జ్ఞానోపదేశంబు
వారు సేయఁగలరు పార్థ నీకు. 34

ఆ॥ వె॥ దాని నెఱిఁగితేని ధరణి మఱల నీకు
నిట్టి మోహబుద్ధి పుట్టఁబోవ
దపుడు దానఁజేసి యాత్మలో నాలోనఁ
గాంచఁగలవు భూతగణము నెల్ల. 35

ఆ॥ వె॥ వసుధ లోనఁ గలుగు పాపాత్ము లందెల్లఁ
బార్థ నీవు పెద్ద పాపి వైన
జ్ఞాన మనెడి తెప్పతోనె సూ సర్వపా
పాబ్ధి దాఁటఁ గల వహార్యవీర్య॥ 26

కం॥ కడు వెలుఁగు నగ్నిహోత్రుఁడు
పుడమిం గట్టెలను భస్మము సలుపుగతిఁ గ
వ్వడి కర్మంబుల నెల్లను
వడివడి జ్ఞానాగ్ని తాన భస్మము చేయున్॥ 37

కం॥ జ్ఞానంబు తోడ నిందు స
మాన పవిత్రంబు లేదు మఱి వస్తువు సూ
చానిని దఱితోఁ దనకుం
దానొందును యోగసిద్ధి తగునతఁ డాత్మన్॥ 38

కం॥ నర శ్రద్ధావంతుఁడు త
త్పరుఁడు జితేంద్రియుఁడు ధరణిఁ బడయును జ్ఞానం
బిరవుగ దానిఁ బడసి వే
పరమంబై వెలుఁగు శాంతిఁ బడయును జుమ్మీ॥ 39

కం॥ నర సంశయాత్ముఁ డజ్ఞుం
డరయఁగ నశ్రద్ధధానుఁ డగు వాఁడు సెడున్
ధర సంశయాత్మునకు నిహ
పరసుఖములు మూఁడు లేవు పౌరవ భాలా॥ 40

ఆ॥ వె॥ యోగమునను గర్మ ముజ్జగించి కిరీటి
జ్ఞానమునను బాసి సంశయమ్ము
లాత్మవంతుఁ డైన యట్టివాఁ డెన్నండు
గట్టువడఁడు సువ్వె కర్మ సమితి॥ 41

మ॥ అదిగావనన్ విను పాండురాజతనయా యజ్ఞానసంభూత మై
మెనలోఁ గూరి మెలంగుచున్న దగు నీ యీసంశయంబెల్లనుం
జిదురై పోవఁగ జ్ఞానఖడ్గమున విచ్ఛేదించి వేవేగమే
పదిలం బారఁగఁ గర్మయోగమును సంభావించి లేవంగదే॥ 42

గద్య

ఇది శ్రీ త్రికవిమిత్ర తాడూరి రామనభట్టాగ్రపుత్ర పండితా
రాధనమండిత లక్ష్మీనరసింహ పండిత ప్రణీతంబైన
యుపనిషత్తును బ్రహ్మవిద్య యును యోగశా
స్త్రంబును శ్రీకృష్ణార్జునసంవాదంబును
నగు శ్రీభగవద్గీతయందు జ్ఞాన
యోగంబను చతుర్థా
ధ్యాయము.

## పంచమాధ్యాయము.

# కర్మసన్యాసయోగము.

ఇట్లు భగవంతుండు చెప్పిన విని యర్జునుండు

తే॥ గీ॥ కర్మసన్యాస మొకమాఱు కర్మయోగ
మొక్కమాఱు నుపదేశించు చున్నవాఁడ
విప్పు డీరెంటిలోపల నెద్ది మేలు
కృష్ణ దానిని దగ నిశ్చయించి చెపుమ॥ 1

అని యడుగుటయు శ్రీభగవంతుం డిట్లనియె॥

తే॥ గీ॥ కర్మసన్యాసమును బార్థ కర్మయోగ
ముభయములు మోక్షసాధక ముర్విలోనఁ
గర్మసన్యాసమునకంటెఁ గర్మయోగ
మైన నారెంటిలో నెక్కు డైన దగును॥ 2

కం॥ పగ గొనఁడు కాంక్ష గొనఁ డీ
జగతి నెవఁడు వాఁడు నిత్యసన్యాసి యనం
దగు బంధమునుండి నరా
విగతద్వంద్వుండు చులక విడుమరఁ గాంచున్॥ 3

తే॥ గీ॥ కర్మయోగంబు వేఱు సాంఖ్యంబు వేఱ
టంచు బాలకు లందురుగా కండ్రె బుధులు
అవని నిం దేదియే నెన్న యభ్యసించు
నతని కీరెంటిఫలములు నబ్బుఁ జువ్వె॥ 4

తే॥ గీ॥ పదవి యేది సాంఖ్యంబునఁ బడయ నగును
బడయనగు నది యోగంబువలనఁ గూడ
సాంఖ్యమును యోగ మొకఁడంచు జగతిలోన
నెవఁ డెఱుంగును వాఁడె సూ యెఱుక గలఁడు॥ 5

కం॥ అమరుట ధరలోఁ గష్టఁ గ
ష్టము యోగము లేక పార్థ సన్న్యాసము సూ
తగ యోగయుక్తుఁ డగు ముని
విగతశ్రముఁ డౌచుఁ గాంచు వెస బ్రహ్మంబున్॥ 6

కం॥ నర కర్మయోగయుక్తుఁడు
పరిశుద్ధాత్ముఁడు జితాత్మపంచేంద్రియుఁ డై
ధర భూతాత్మాత్ముం డై
యరయ సలిపె నేని గర్మ మంటదు వానిన్॥ 7

కం॥ కనుచును దాఁకుచు నడుచుచు
వినుచును నిద్రించు చూర్పు విడుచుచుఁ దగ వా
సనచూచుచుఁ బల్కుచు దిం
చును గను దెఱచుచును మూయుచును గొను చిదుఁగుఁ॥ 8

ఆ॥ వె॥ ఇంద్రియమ్ము లెల్ల నింద్రియార్థములందు
మెలఁగు ననుచుఁ దలఁప వలయుఁ గాక
యేను గర్త ననుచు నెన్నంగ రాదు సు
మ్మవనిఁ దత్త్వవేత్త యైన యోగి॥ 9

ఆ॥ వె॥ పరఁగఁ గర్మములను బ్రహ్మార్పణము సేసి
యాస లేఁది యెవ్వఁ డాచరించు

నతనిఁ బాప మంట దర్జునా యంబువు
లవనిఁ దామరాఁకు నంట నట్లు॥ 10

ఆ॥ వె॥ ఆత్మశుద్ధికొఱకు నపఁచి ఫలాశను
గర్మ మాచరించుఁ గర్మ యోగి
తనువుతోడ నేని మనసుతో నే వట్టి
యింద్రియములతోడ నేని పార్థ॥ 11

తే॥ గీ॥ నెమ్మి యుక్తుఁడు కర్మఫలమ్ము విడిచి
పొనర నైష్ఠికశాంతిని బొందఁ గలఁడు
కామి యగాట నయుక్తుండు కర్మ ఫలము
లందుఁ దవులుచు నర్జునా బందెఁ బడును॥ 12

కం॥ పురమిని జితేంద్రియుఁడు క
వ్వడి మదిచేఁ గర్మములను వాకిళ్ళుమ్మా
డడ రెడు పురి మెయి విడఁచుచు
నెపవిడియును గర్త్రకారయిత గా కెలమిఁ॥ 13

కం॥ పుట్టింపఁడు కర్తృత్వము
పుట్టింపఁడు కర్మములఁ బ్రభువు వానికినిం
బుట్టింపఁడు ఫలయోగము
పట్టీ యివి యెల్లనగు స్వభావముచేతన్॥ 14

కం॥ నరకైకొనఁడు విభుండే
పురుషునివగుపుణ్యపాపములు జ్ఞానంబున్
ధర నజ్ఞానముకప్పం
బురుషు లరయ దానిచేత మోహితులు గదా॥ 15

కం॥ విమలం బగునాత్మజ్ఞా
నము త్రుంచును ధరణియందున నెవరియజ్ఞా
నము నలవారికి జ్ఞానం
బమరఁగఁ బరమాత్మఁ జూపు నాదిత్యు క్రియన్॥ 16

ఆ॥ వె॥ వానిఁ దలఁచి తన్ను వానిగా భావించి
వానియందు నిలిచి వానిఁ దవిలి
జ్ఞానవహ్నిదగ్ధసర్వపాతకుఁ డయి
మరలరానిపదవి మనుజుఁ డొందు॥ 17

కం॥ వినయము విద్యయుఁ గల బ్రా
హ్మణునెడ గోవునెడ నేన్గునందున శునకం
బునెడం దద్భుక్కునెడం
జనఁ బండితుఁ డైనవాఁడు సమదర్శియుఁ డౌ॥ 18

కం॥ సమదృష్టు లింద సంసా
రము గెల్చినవారు సువ్వో బ్రహ్మము నిర్దో
షమయి సమం బౌటను బ్ర
హ్మమునం దుండంగలార లాసమదృష్టుల్॥ 19

ఆ॥ వె॥ బ్రహ్మవిదుఁడు తాను బ్రహ్మంబునం దుండి
బుద్ధి నిలిపి మోహబుద్ధి యెడపి
కులుకఁ బోఁడు మేలు కలిగినచోఁ గీడు
వచ్చుచోట నింత వగవఁ బోఁడు॥ 20

కం॥ పుడమిని బాహ్యస్పర్శల
బడి తవులక వెలయు నెవఁడు నడయు సుఖమ్మా

తఁడు బ్రహ్మయోగయుక్తా
త్మఁ డౌచు క్షయరహితసౌఖ్యముం దగఁ బొందున్॥ 21

కం॥ భువి విషయేంద్రియములచే
నవుభోగము లాది తుదియు సకట కలిమిచే
నవి దుఃఖభాజనంబుల
యవి యింపులు గావు బుధుల కమరేశసుతా॥ 22

కం॥ ఏవాఁడు ప్రాణ ముండఁగ
గా వాసవి యింద యోపుఁ గడఁకఁ గామక్రో
ధావేశము నడఁపంగా
నా వాఁడే యోగి మఱియు నాతఁడె సుఖియున్॥ 23

కం॥ తనలోన సుఖము నందుచుఁ
దనలోఁ గులుకుచు వెలుంగుఁ దనలో నెవఁ డా
ఘనయోగి బ్రహ్మభూతుఁడు
చన బ్రహ్మానంద మతఁడు జగతిం బొందున్॥ 24

కం॥ అర్జున బుధు లిలఁ గల్మష
వర్జితులై సంశయములఁ బాసి మనంబున్
నిర్జించి మోక్షమును సము
పార్జింతురు సర్వభూతబహుహితపరులై॥ 25

కం॥ పుడమిని గామాద్యరులను
విడిచి నియతచిత్తు లగుచు విదితాత్ములమై
కడఁకఁ దనరెడుయతులకుఁ జే
పడు మోక్షం బెల్లయెడలఁ బాండుకుమారా॥ 26

కం॥ వెలిచేయుచు బాహ్యస్ప
ర్శల భ్రూమధ్యంబునందు చక్కఁగ దృష్టిన్
నిలువుచుఁ బ్రాణాపానం
బుల ముక్కుఁబుటములను పొదలఁ బొనరించి సరిగన్॥ 27

కం॥ నలి బుద్ధి మానసేంద్రియ
ముల గెలిచి భయంబు గ్రోధమును గామంబుం
దొలఁగించి ముక్తిఁ గోరెడు
నలముని తా నిత్యముక్తుఁడ సుమీ పార్థా॥ 28

కం॥ అనఘా యజ్ఞతపోభో
క్తనఖిలలోకేశ్వరుఁడ సకలభూతసుహృ
త్తును నే నని నెఱి నెఱుఁగుచుఁ
జనునాతఁడు సర్వకాలశాంతిం బొందున్॥ 29

ఇది శ్రీ త్రికవిమిత్రి తాడూరి రామనభట్టాగ్రిపుత్రి పండి
తారాధనమండిత లక్ష్మీనరసింహపండిత ప్రణీతంబైన
యుపనిషత్తును బ్రహ్మవిద్యయును శ్రీకృష్ణార్జు
న సంవాదంబును నగు శ్రీ భగవద్గీత
యందుఁ గర్మసన్యాసయోగం
బను పంచమాధ్యా
యము.





ఆఱవయధ్యాయము.

# ఆత్మసంయమయోగము

ఇట్లు చెప్పి మఱియు భగవంతుం డిట్లనియె.

తే॥ గీ॥ పుడమిఁ గర్మఫలాపేక్ష విడిచి యెవఁడు
చేయఁ దగినట్టి కర్మముల్ సేయుచుండు
వాఁడె సన్న్యాసి మఱియును వాఁడె యోగి
యగ్నులును గర్మములు మానినతఁడు కాఁడు॥ 1

కం॥ ఎది సన్న్యాసం బని యం
డ్రదియే ధరఁ గర్మయోగ మర్జున వినుమా
విదితంబుగ సంకల్పము
మది వదలక యోగి కాఁడు మహి నెవ్వాఁడున్. 2

కం॥ యోగపదంబును నెక్కం
గాఁ గర్మము మునికిఁ ధరణిఁ గరణ మతనికే
యోగారూఢత యబ్బం
గాఁ గర్మత్యాగ మరయఁ గరణము సువ్వే. 3

తే॥ గీ॥ అవని సర్వసంకల్పసన్న్యాసి యగుచుఁ
దగుల మొక్కింత యింద్రియార్థములయందుఁ
గర్మములయందుఁ బడక తా నిర్మలుఁ డెప్పు
డగును నరుఁడు యోగారూఢుఁ డప్పు డనఁ బడు. 4

తే॥ గీ॥ తన్నుఁ దా నుద్ధరించంగ ధరణి వలయు
వలవ దది త న్నధో గతి పాలు సేయ
తనకు మేలైనచుట్టంబు తాన సువ్వె
తనకు మఱియును బగవాఁడు తాన సువ్వె.

తే॥ గీ తన్నుఁ దాను జయించును ధరణి నెవఁడు
తనకుఁ దా మేలిచుట్టమై తనరు వాఁడు
తన్ను దాఁ గెల్వ లేఁడేని దనకుఁ దాన
వైరి వోలెను వైరభావమున మెలఁగు. 6

తే॥ గీ॥ తన్ను గెలుచు మహాశాంతు సన్నుతాత్మ
క్రీడి శీతోష్ణవేళలఁ గీడుమేళ్ల
యవసరముల మానావమానావసరము
లందుఁ దా నేక రీతిగా నమరి నిల్చు. 7

తే॥ గీ॥ జ్ఞానవిజ్ఞానములచేతఁ జక్కఁ దనిసి
నిర్వికారుఁడు నిర్జితేంద్రియుఁడును నయి
యల్లబంగారమును ఱాయి చిల్లపెంకు
నొక్కటిగ జూచుయోగిని యుక్తుఁ డండ్రు. 8

క॥ వినుము సుహృన్మిత్రుల నరు
ల నుదాసీనులను ద్వేష్యులను జుట్టల స
జ్జనులను మధ్యస్థుల దు
ర్జనులను సమబుద్ధిఁ జూచుజనుఁ డెక్కుడు సూ. 9

కం॥ నిలుచుచు నొంటి రహస్య
స్థలమునఁ జిత్తాత్మలన్ వెసం బట్టుచుఁ గో
ర్కెలును నభిమాన మఱి ని
చ్చ లభ్యసించు నది యోగి చన యోగంబున్. 10

తే॥ గీ॥ స్థిరముగా నొక్క శుచి యౌ ప్రదేశ మందుఁ
గుశలు కృష్ణాజినము బట్ట గొర్కి నొకటి
మొంటఁ బఱచుచు నాసనం బొనర మిగుల
నెత్తు పల్లంబు గాకుండ నేరుపఱచి. 11

తే॥ గీ॥ అందుఁ గూర్చుండి మనము నేకాగ్రముగను
గ్రీడి చేసి చిత్తేంద్రియక్రియల గెలిచి
యాత్మశుద్ధినిమిత్తమై యభ్యసింప
వలయు యోగంబు తా యోగి వసుధలోన॥ 12

కం॥ సరిగా నొడలును మెడయును
శిరము గదలకుండ నిలిపి చెచ్చెఱఁ బార్థా
స్థిరుఁడై దిక్కులు చూడక
కరమ్ము తనముక్కు మొనను గాంచుచు దీక్షన్. 13

కం॥ భయ మేఁది ప్రశాంతాత్ముం
డయి పార్థా బ్రహ్మచర్యమం దుండి మదిన్
నియమించి నన్నుఁ దలఁచుచు
ను యుక్తుఁడై యుండవలయును న్మత్పరుఁడై. 14

కం॥ నర నియతమానసుం డై
నిరతం బీరీతిఁ దన్ను నెలకొలుపుచు యో
గి రయమున మోక్షపరమై
పరఁగెడునాలోని శాంతిఁ బడయుఁ గలఁడు సూ. 15

కం॥ ధరలోనఁ దిండిపోతును
నరయఁగ శుష్కోపవాసి యగునతఁడును ని
ద్దురపోతును మిక్కిలి జా
గరము సలుపువాఁడు యోగి కానేరఁడు సూ. 16

కం॥ మితభోజనము విహారము
మిత మగునది పనుల లోన మితమగు చెయ్వుల్
మితమగు నిద్దుర వేఁగుట
క్షితి యోగము దుఃఖ హరముఁ జేకుఱఁ జేయున్. 17

కం॥ ఎప్పుడు కరమే కాగ్రిత
నొప్పారుచు నాత్మ యంద యుండును జిత్తం
బి ప్పుడమి లోనఁ బురుషుం
డప్పు డకాముఁ డయి యుక్తుఁ డనఁగఁ బరంగున్॥ 18

ఆ॥ వె॥ గాలి లేని చోటఁ గదల కిట్టట్టు ని
శ్చలత వెలుఁగు దివ్వె సామ్యమందు
రాత్మయోగ మవని నభ్యసించి వెలుంగు
వశ్యచిత్త యోగివర్యు నకును. 19

ఆ॥ వె॥ ఎందు యోగసేవ నిల నిగ్రహింపంగఁ
బడిన దగుచు మనసు వడయు శాంతి
నాత్మచేత నెందు నాత్మను జూచు చా
నంద మొందు నాత్మ యందు నరుఁడు. 20

కం॥ ధర నెందు నతీంద్రియ మై
పరబుద్ధిగ్రాహ్యమైన బ్రహ్మానందం
బరయంగఁ బడసి యెందున్
స్థిరుఁ డై తత్త్వమున నుండి తిరుగఁ డ మరలన్. 21

తే॥ గీ॥ అమరఁగా నెద్ది వడసి తా నంత కెక్కు
డైన లాభంబు లేదని యాత్మఁ దలఁచు

నెందుఁ దగ నిల్చి చలియింపఁ డింత యేని
యెంత కష్టంబు వచ్చెనఁ యేని తనకు. 22

తే॥ గీ॥ కష్టములకును సంబంధ మంగనిది యైన
యల్ల దానిని యోగమ టండ్రు సువ్వొ
పఱఁగ సలయోగ మభ్యసింపంగ వలయు
స్థిరము సోత్సాహ మైనట్టి చిత్తమునను. 23

తే॥ గీ॥ ఘనపరాక్రమ సంకల్పజన్యమైన
సర్వకామముల్ నిర్విశేషముగ విడిచి
విషయములమీఁదఁ బోకుండ విపులమతిని
నిగ్రహించుచు నింద్రియానీక మెల్ల. 24

ఆ॥ బుద్ధి స్థిరము చేసి పొంగారుచుండెడు
మనము నాత్మలోనఁ జొనిపి విజయ
యొనర మెల్ల మెల్ల నుపరతిఁ బొందింప
వలయు వేఱుఁ జింత వలవ దపుడు. 25

తే॥ గీ॥ చంచలం బస్థిరం బయి చనెడు చిత్త
మెందు నెందునఁ దిరుగు నందందు నుండి
దాని మరలించి వే వే పృథాతనూజ
తనకు వశ్యంబుగాఁ జేసికొనఁగ వలయు. 26

కం॥ మనము ప్రశాంతమగుచుం
డును శాంతరజోగుణుండును విగతపాపుం
డును బ్రహ్మభూతుఁ డగు యో
గిని బరమానందలక్ష్మి కెరలి వరించున్. 27

కం॥ నిరతం బీగతి నంతః
కరణంబు లయించి విగతకల్మషుఁ డగుచో
గి రయమున బ్రహ్మ సాయు
జ్యరమఁ జులకఁ గుడుచు వాఁ డనంత సుఖంబున్. 28

తే॥ గీ॥ అర్జునా యోగయుక్తాత్ముఁ డై వెలుఁగు న
తండు తగ నాత్మ నఖిలభూతంబులందు
నఖిలభూతంబులను నాత్మనందుఁ గాంచి
యన్నిఁటను సమదర్శనుం డై వెలుంగు. 29

కం॥ ఎవ్వం డన్నిఁట ననుఁ గని
కవ్వడి యన్నింటి సమరఁ గాంచును నాలో
నవ్వాని విడువ నెన్నఁడు
నవ్వాఁడును నన్ను విడువఁ డమరఁగ వింటే. 30

కం॥ ఎవ్వం డేకత నిలుచుచు
మవ్వఁబున సర్వభూతమయుఁ గొల్చును న
న్నవ్వాఁ డెన్నేఁ దిరుగు
ళ్కవ్వడి తిరిగినను దిరుగుఁ గా నాయందే. 31

కం॥ కను సరిగాఁ దనసామ్యం
బున నర్జున యెవఁడు సర్వభూతముల సుఖం
బును నైనను గష్టము నై
న నాతఁడే పరమయోగి నామతమందున్. 32

ఇట్లు భగవంతుండు బోధించుటయు నర్జునుండు.

కం॥ చన నిందాఁకను మధుసూ
దన సమతాయోగ మెల్ల దయఁ జెప్పితి వై

నను మది గడుఁ జంచలమౌ
ట నది సరిగ నిలుచు నని యెడందఁ దలంపన్. 33

క॥ నిలుకడ లేనిది బల మై
యలయించెడునదియు గట్టిదై నదియుఁ గదే
యిల మనసు దానిఁ నిలుపు ట
నిలు నిలిపెడునంతభరమని తలఁతుఁ గృష్ణా. 34

అనుటయు శ్రీ భగవంతుండు.

క॥ నిలుపఁగ భర మైనదియును
నిలుకడ లేనిదియు మనసు నిజ మిది యైనన్
నలి నలవాటున ఘనభుజ
యిల వైరాగ్యమున నది గ్రహింపఁగ వచ్చున్. 35

క॥ భర మగు యోగము వడయఁగ
నరయ మనసు గెలువ లేనియతనికిఁ గా కో
నర సమనోనిగ్రహుఁ డై
వెరవున యత్నింపఁగా భువిం బడయనగున్. 36

అని చెప్పుటయు నర్జునుండు.

క॥ చను శ్రద్ధోపేతున కై
నను నియమము లేమిచే మనం బింత చలిం
చును దాన యోగసిద్ధిని
గనఁడు గదా యెట్టి క్షేమగతిఁ గాంచు హరీ. 37

క॥ తనరఁగ బ్రహ్మపథము తెలి
యనిమూఢుం డప్రతిష్ఠుఁ డై రెంటికిఁ గా

కేనఘూ చెదరిన మేఘము
చనియెడుగతిఁ జెడఁడె మదిని జర్చింపంగన్. 38

కం॥ ఈనాసంశయమును గృ
ష్ణా నిశ్శేషముగఁ దీర్పఁ జాలుదు వీ వే
మానుగ దీనిని దీర్పం
గా నోపెడు వాఁడొరుండు కలఁడే యెందున్. 39

అని యడుగుటయు శ్రీ భగవంతుం డిట్లనియె.

కం॥ ఇందైనఁ బాండవేయా
యందైనను జెఱుపులేద యతనికిఁ జువ్వే
యెందును మేల్ సేసెడునతఁ
డందఁడు దుర్గతిని నిక్క మరయఁగఁ దండ్రీ. 40

కం॥ ఇల యోగభ్రష్టుఁడు పు
ణ్యాలోకములు వొంది పెక్కు లగువత్సరముల్
నిలిచి శుచి గలుగు శ్రీమం
తులయింటను బుట్టుఁ దనమనోరథ మారన్. 41

తే॥ గీ॥ అట్లు గాకున్న ధీమంతు లైన యట్టి
యోగులకులంబునను బట్టు నొనర నతఁడు
పుడమియందున నిట్టి యీపుట్టు వరయ
నధిక దుర్లభ మెనట్టియదియ గద వె. 42

తే॥ గీ॥ అందుఁ బూర్వజన్మార్జిత మైన తనదు
బుద్ధిసంయోగమును బొందు బొనర మరల
ధ్యానయోగసిద్ధికి నయి యత్న మెలమి
నాచరించును గురుపుత్రి యతఁడు పిదప. 43

తే॥ గీ॥ అతఁడు కడఁగఁ డైన నల దొంటియభ్యాస
మతని మరలుకొలుపు నల్లయోగ
మెఱుఁగఁ గోరు వాఁడు నిలను శబ్దబ్రహ్మ
దాఁటువాఁడు సువ్వె తథ్యముగను. 44

ఆ॥ వె॥ యోగి పూన్కివట్టి యుద్యోగముం జేయు
చమరఁ బాపముక్తుఁ డై యనేక
జన్మకారణమున సంసిద్ధుఁ డైతుదిఁ
బడయు వాఁడు సువ్వె పరమగతిని. 45

ఆ॥ వె॥ జ్ఞానికంటె మేలు మానుగాఁ గర్మిష్ఠి
కంటె మేల్ తపస్వికంటె మేలు
యోగియైనయాతఁ డుర్విలో నదిగాన
యోగి వీవు కమ్ము వేగ పార్థ. 46

ఆ॥ వె॥ ఎల్ల యోగులందు నెవఁ డంతరాత్మలో
నిలిపి నన్ను శ్రద్ధఁ గొలుచుచుండు
నాతఁ డొకఁ డ నాకు ననుకూలుఁ డై వెల్గు
శ్రేష్ఠుఁ డైన యోగి క్రిడి వింటె. 47

ఇది శ్రీత్రికవిమిత్ర తాడూరి రామనభట్టాగ్రపుత్ర పండితారాధన
మండిత లక్ష్మీనరసింహ పండిత ప్రణీతంబైన యుపనిషత్తును
బ్రహ్మవిద్యయును యోగశాస్త్రంబును శ్రీకృష్ణార్జున
సంవాదంబును నగు శ్రీ భగవద్గీతయం దాత్మ
సంయమయోగంబను షష్ఠాధ్యాయము.



భగవద్గీత.

ఏడవయధ్యాయము.

# విజ్ఞానయోగము.

అని చెప్పి మఱియు భగవంతుండిట్లనియె.

కం॥ ననుఁ దవిలికొనిన మనమున
నొనరఁగ నన్నాశ్రయించి యోగాభ్యాసం
బొనరుచుచు సమగ్రంబుగ
ననుఁ జక్కఁగ నెఱుఁగు తెఱఁగు నర వినుమింకన్. 1

కం॥ ఇదె సాకల్యంబుగఁ జె
ప్పెద జ్ఞానం బేను నీకు విజ్ఞానముతో
నది యెఱిఁగి తేని మఱి యుం
డ దెఱుంగం దగిన దొండు నర యీపట్లన్. 2

కం॥ పలువేవురకు నొకానొకఁ
డిల యత్నము చేయు సిద్ధి కేచేసెడు సి
ద్ధులుపలువేవుర లోపల
నలి నెఱుఁగు నొకానొకం డ ననుఁ దత్త్వమునన్. 3

కం॥ భూమియు నీళ్లు నగ్గియు
నామరుదాకాశబుధ్యహంకృతులును సు
త్రామసుత మనము నని నా
యీ మాయాశక్తి విధము లెనిమిది యయ్యెన్. 4

కం॥ ఇది కొలఁదిది గొప్పది యై

నదియై మత్త జీవభూత మైనదియై నా
యది యగు రెండవ ప్రకృతి క
లదు విను మది దాల్చి చుండు లలి నీజగమున్. 5

కం॥ నిరతము ప్రాణుల కెల్లన్
నర యివి యే జన్మకారణము లది గానన్
సరి యిరవ యెల్ల జగమున
కర యం గాఁ బుట్టఁ గాను నడఁగఁగ నేనే. 6

కం॥ ఆరయఁగ నాకు మిక్కిలి
కారణ మొండొకటి లేదు కాసంతైనం
దారము మణిపూసలలో
దూరిన గతి నెల్లయందు దూరిన వాఁడన్. 7

కం॥ ఇనచంద్రుల వెల్గును జల
మునఁ గల రస మెల్ల వేదములఁ గల ప్రణవం
బును మింటఁ గలుగు శబ్దము
జనఁ బురుషులలోని పౌరుషమును నేనే సూ. 8

ఆ॥ వె॥ పుడమిలోనఁ గలుగు పుణ్యగంధంబు ను
నగ్గిలోనఁ గలుగు నట్టి తేజ
మెల్ల భూతసమితి నెసఁగుజీవనము త
పస్వులందుఁ గల తపస్సు నేన. 9

కం॥ విను సర్వ భూతములకున్
సనాతనం బైన విత్తనము నేనే యు
జ్ఞన బుద్ధియుతుల దగు బు
ది నేన తేజస్వులందుఁ దేజము నేనే. 10

కం॥ బల సూదనసూనా విను
బలియురలోఁ గామరాగవర్జితబల మే
నిల జంతు జాలములలో
గలిగినధర్మావిరుద్ధకామము నేనే. 11

కం॥ ఎయ్యవి సాత్వికభావము
లెయ్యవి రాజసము లవని నెవి తామస మో
యయ్యవి నాచేతనయిన
యయ్యవె యందుండ నుండు నవి నాయందే॥ 12

తే॥ గీ॥ అనఘ యాత్రిగుణాత్మిక మయినభావ
ములను మోహిత మగుచు నీభువన మెల్ల
నల్లవాని కతీతుండ నవ్యయుండ
నై వెలుఁగు న న్నెఱుంగ దావంత యైన. 13

కం॥ త్రిగుణాత్మకమై కష్ట్రమె
నఁగు నా యీదేవమాయ జనుల కలంఘ్యం
బు గదే నన్నే యెవ రం
దఁ గాంత్రు తరియింత్రు వారు తగ నామాయన్. 14

కం॥ ధరఁ బాపులు మూఢులు నగు
న రాధములు జ్ఞాన మెల్ల నర నామాయన్
హరియింపఁ బడుటఁ జేసి య
సురభావము దాల్చి నన్నుఁ జేరరు శరణమున్॥ 15

కం॥ ననుఁ గొల్చెదు సత్పురుషులు
చన నాల్గువిధములవారు జగతిన్ వా రే
రన నార్తుఁడు జిజ్ఞాసుం

డనఘా యర్థార్థి జ్ఞాని యనియెడు వారల్. 16

కం॥ అలనలువురిలోపల ని
చ్చలు యోగము పరమభక్తి సలుపుచు నిలలో
వెలిఁగెడుజ్ఞాని యధికుఁ డే
నలవానికి నాకునతఁన డునుఁగుఁ బ్రియులమే. 17

కం॥ ఆనలువురు ను నుదారుల
కాని నరా జ్ఞాని నన్నె కా భావింతున్
జ్ఞాని నియతాత్ముఁ డౌచున్
నేనే పరమగతి యంచు నిలుచును గాదే. 18

కం॥ పలుజన్మము లై కడపట
నలయాతఁడు జ్ఞానవంతుఁ డై నర సర్వం
బలవాసుదేవుఁ డని న
న్గలయు నలమహాత్ముఁ డరయఁ గర మరిది సుమ్మా. 19

కం॥ ఈయూ కోర్కులచేత న
రా యెఱు కటి స్వప్రకృతినియతు నై నరు లా
యాయినియమములు సలుపుచు
నీయాదేవతలఁ గొల్తు రెలమి మెలర్పన్. 20

కం॥ ఏయేభక్తుఁడు కోరెను
నేయేవిగ్రహము శ్రద్ధ మెసఁగఁ గొలువ గా
నాయాభక్తున కిచ్చెద
నాయావిధ మైనశ్రద్ధ నచలము గాఁగన్. 21

కం॥ అలశ్రద్ధను ము న్నిడికొని
యలభక్తుఁడు పూజసేసి యలవిగ్రహ మ

వ్వాల నాప్రసాదమున నే
నలిఁ బొందం గలఁడు సూ తనయభీష్టంబుల్. 22

కం॥ ధర నల్పబుద్ధు లగు న
ప్పురుషుల కబ్బెడు ఫలంబు పోలియును బార్థా
సురలను సురభక్తులు న
న్నరయం గా నాదు భక్తులందెదరు సుమీ. 23

కం॥ అవ్యక్తుఁడ నగు నన్ని
చ్ఛోవ్యక్తుఁ డ నందు బుద్ధిశూన్యులు పార్థా
యవ్యయ మనుత్తమము నా
దివ్యపరమ భావ మకట తెలియనివాంఛ్రై. 24

కం॥ క్షితిలోన యోగమాయా
వృతుఁడ నగుట నెల్లవారి కెఱుకపడను నే
మతి మూఢలోక మెఱుఁగదు
మృతియును జన్మంబు లేక యెసఁగుదు నంచున్. 25

కం॥ కడచినభూతంబుల ని
ప్పుడు తగ వర్తించు భూతముల నిటఁ బైవ
చ్చెడు భూత జాలమును గ
వ్వడి యెఱుఁగుదుఁ గాని నన్నెవం డెఱుఁగఁడు సూ. 26

కం॥ ఇలలో రాగద్వేషం
బులఁ బుట్టెడు ద్వంద్వమోహమున సర్వప్రా
ణులు తమపుట్టినపుడ మి
క్కిలి యజ్ఞానంబు గందు క్రీడి వింటే. 27

క॥ ఎవ్వరు సత్కర్మంబుల
వివ్వచ్చుడ చేసి పాపవితతి నెడపు వా
రవ్వారు ద్వంద్వ మోహము
త్రెవ్వి నమం గొల్చు వారు దృఢనియమమునన్. 28

క॥ సలుపుదురు జరామరణం
బులవిడుమురకొఱకు యత్నము న్న న్నె వ్వా
రలు కొల్చి వా రెఱుంగుదు
రల బ్రహ్మము నఖిల కర్మ మధ్యాత్మంబున్. 29

ఉత్సాహ॥ అమర నన్ను సాధిభూతుఁ డంచు సాధిదైవ మం
చు మఱి సాధి యజ్ఞుఁ డంచుఁ జొప్పడంగ నర్జునా
తమమునంబునం దెఱుంగు ధన్యులెల్ల యోగు లై
యమలమతిని నన్నుఁ గందు రంతకాలమందునన్. 30

గద్య.

ఇది శ్రీత్రికవిమిత్ర తాడూరి రామన భట్టాగ్రపుత్ర పండితా
రాధన మండిత లక్ష్మీనరసింహ పండిత ప్రణీతంబయిన
యుపనిషత్తును బ్రహ్మవిద్యయును యోగశా
స్త్రంబును శ్రీ కృష్ణార్జున సంవాదంబు
ను నగు శ్రీ భగవద్గీతయందు
విజ్ఞానయోగంబను
సప్తమాధ్యాయము.





# భగవద్గీత.

## ఎనిమిదవయధ్యాయము.



ఇట్లు భగవంతుండు చెప్పుటయు నర్జునుండు

కం॥ ఎయ్యది యల బ్రహ్మం బన
నెయ్యది యధ్యాత్మ మనఁగ నెది కర్మము నా
నెయ్యా దధిభూతమనఁగా
నెయ్యది యధిదైవ మనఁగ నెఱిఁగింపు హరీ. 1

కం॥ ఇందు మఱి యీశరీరం
బం దధియజ్ఞుఁడెవఁ డెట్టులతని నెఱుఁగ గో
విందా ప్రయాణకాలం
బం దచలాత్ములకు నెట్టు లగు నిన్నెఱుఁగన్. 2

అనియడుగుటయు శ్రీభగవంతుండిట్లనియె.

కం॥ పరమాక్షర మాబ్రహ్మం
బరయఁ గిరీటీ స్వభావ మధ్యాత్మం బి
ద్ధర భూతభావసంభవ
కరమైన విసర్గమెల్లఁ గర్మ మనఁ బడున్. 3

క॥ క్షరభావం బధిభూతము
పురుషుం డధిదైవతంబు పురుషశ్రేష్ఠా
పరిపరిశరీరములలోఁ
జరించు నధియజ్ఞుఁ డనఁగ జగతి న్నేనే. 4

కం॥ మరణసమయమున నన్నే
స్మరియించుచు మేను విడిచి చనునాతఁడు తాఁ
బొరయును మద్భావంబును
నరయంగా నిందు సందియము లే దనఘా. 5

కం॥ పురుషుం డెయ్యేభావము
స్మరించుచున్ విడుచు మరణసమయంబున నాఁ
బొరయు నతఁ డది యడియ యు
ద్ధురతరతద్భావభావితుఁడయి నిరతమున్. 6

కం॥ అది గావున నెల్లప్పుడు
మది నం దలఁచుచును జేయుమా యుద్ధంబున్
మది బుద్ధియు నాస్సై ని
ల్పు దేని నిస్సంశయముగఁ బొందెదు నన్నే. 7

కం॥ ఇలలో రెండవ దెఱుఁగక
మెలఁగెడు నభ్యాసయోగమిళితమనముతోఁ
దలపఁగ యథావిధి నరా
యలదివ్యునిఁ బరమ పురుషు నంటఁగ వచ్చున్. 8

కం॥ అనుశాసితుఁడు పురాణుం
డును గవియు నచింత్య రూపుఁడును నణువుల కె
ల్లను నణువు తమోదూరగుఁ
డినవర్ణుఁడు సర్వధాత యితఁ డెవఁ డితనిన్. 9

కం॥ తన పోయెడుకాలంబున
మన మచలముచేసి భక్తి మఱి యోగబలం
బున బొమలనడుమఁ బ్రాణం

బు నిలిపి స్మరియించు వాఁడు వొందును వీనిన్. 10

ఉ॥ ఎయ్యది యక్షరంబనుచు నెల్లశ్రుతిజ్ఞులు పల్కుచుండు వా
రెయ్యది వీతరాగులయి యెల్లరు యోగులు చొచ్చుచుండువా
రెయ్యది కోరి చేయుదు రక్షీణవివేకిత బ్రహ్మచర్య మే
నయ్యది యా పదంబు తగ నర్జున చెప్పెద సంగ్రహంబుగన్.

కం॥ ద్వారము లెల్లను మూసి కు
మారా హృదయంబునందు మదినిల్పి సహ
స్రారమునఁ బ్రాణముంచి య
నారతమున్ యోగధారణమ్ము నలుపుచున్. 12

తే॥ గీ॥ కవ్వడీ బ్రహ్మనాచకోంకార మాచ
రించుచును నన్ను లెస్స స్మరించు చెవ్వఁ
డొడలు విడనాడి పోవును బుడమినుండి
వాఁడు పరమపదంబును బడయఁ గలఁడు. 13

కం॥ ఎన్నం డొం డెఱుఁగని మది
న న్నెడతెగక స్మరియించు నలిఁ దా నెవ్వం
డన్నియతయుక్తయోగి జ
గన్నుత సులభముగ నన్నుఁ గాంచుం జువ్వే. 14

కం॥ ననుఁబొంది యీ మహాత్ములు
జననుత దుఃఖాలయం బశాశ్వత మగునీ
జననము మరలం బొందరు
ఘనపరమంబైనసిద్ధి గాంచిన కతనన్. 15

కం॥ అల బ్రహ్మభవన మందాఁ
క లోకములు పొరిని జచ్చికమ్మఱఁ బుట్టున్

నలి నన్నుఁ బొందు నవ్వా
ర లైన మఱి పుట్టఁ బో ర్జునా విను మెందున్॥ 16

తే॥ గీ॥ యుగసహస్రపర్యంత మై యొప్పు నల్ల
బ్రహ్మపవలంచు నట్టులేవాని రేయి
తా సహస్రయుగాంతమై తనరు నంచుఁ
బలుకుదురు కాలసంఖ్యావిదులు కిరీటి. 17

ఆ॥ వె॥ అరయఁ బవలు రాఁగ వ్యక్తంబులెల్ల న
వ్యక్తమందుఁ బుట్టి వఱలు చుండుఁ
బార్థ రాత్రివేళ వచ్చుడు నల్ల య
వ్యక్త మంద యడఁగు నట్టివగును. 18

కం॥ అదియే భూతసమూహము
విదితంబుగ మరల మరల వెలసి యవశతం
జదియుచు రే రాఁ గానే
యుదితం బగుచుండుఁ దా దినోదయవేళన్. 19

కం॥ నర యీయవ్యక్తునకుం
బరమపురాణుండు గలఁడు పరుఁ డవ్యక్తుం
డరయఁగ భూతము లన్నియు
మరణం బందినను వాఁడు మహిమ న్నిలుచున్. 20

కం॥ విను మవ్యక్తం బక్షర
మనిశది యెద్దానిఁ బొంది యవ్వల మరల రా
ఘనపరమగతి యటందురు
తనరఁగ నది నాదు పరమధామము కట్టీ. 21

కం॥ ఎవ్వం డన్నిఁట నిలిచెడు

నెవ్వనిలోఁ బ్రాణికోటి యెల్ల నెసఁగునో
యవ్వానిఁ బరమపురుషుని
నెవ్వనికి ననన్యభక్తినే కనవచ్చున్. 22

తే॥ గీ॥ ఎపుడు పయనమేగెడుయోగు లెఱుఁగువార
లెపుడు పయనమేగెడుయోగు లెఱుఁగ రజ్జ
నా పునర్జన్మ మాయాయి యవసరములఁ
దెలియఁ జెప్పెద వినవయ్య తేటపడఁగ. 23

కం॥ అనలజ్యోతుల దివస
మ్మున శుక్లమ్మునను రెండుమూళ్లగు నెలవై
చనునుత్తరాయణమ్మునఁ
జనుబ్రహ్మవిదుండు బ్రహ్మఁ జయ్యనఁ గాంచున్. 24

కం॥ వినుమీ పొగ రేఁ గృష్ణము
నను బాధ్రా దక్షిణాయనం బార్నెలలం
దునఁ బోవుయోగి యైనను
బొనరఁగఁ గని చంద్రలోకము మరలఁ బుట్టున్. 25

కం॥ ప్రకటముగ రెండుఁ దెరువులు
సకలమునకు వెలుఁగు మబ్బు శాశ్వతముగ నం
దొకటఁ జని మరలఁ బుట్టం
డొకటం జని మరలఁ బురుషుఁడుర్విం బుట్టున్. 26

కం॥ నెఱి నీ రెండగుమార్గము
లెఱిఁగిన యేయోగి మోహమెఱుఁగఁడు గానన్
గఱి నీవు సార్వకాలం
బఱమర లేకభ్యసింపు మా యోగంబున్. 27

మ॥ తలఁపం దీనిని లెస్సగా నెఱిఁగి పార్థా వేదపారాయణం
బులకున్ యజ్ఞవిధానదానములకున్ భూమిం దపశ్చర్యకుం
గలపం చాడిన యట్టి పుణ్యఫల సంఘంబుల్ వెసం దాఁటి తా
నలరన్ యోగివరుం డెఱుంగఁ గలఁ డాద్యంబౌ పరబ్రహ్మమున్.28

గద్య.

ఇది శ్రీ త్రికవిమిత్ర తాడూరి రామన భట్టారక పుత్త్ర పండితా
రాధన మండిత లక్ష్మీనరసింహ పండిత ప్రణీతంబయిన
యుపనిషత్తును బ్రహ్మవిద్యయును యోగశా
స్త్రంబును శ్రీ కృష్ణార్జున సంవాదంబు
ను నగు శ్రీ భగవద్గీతయం దక్ష
రపరబ్రహ్మయోగమను
నష్టమాధ్యాయము.





భగవద్గీత

తొమ్మిదవయధ్యాయము.

# రాజవిద్యారాజగుహ్యయోగము.

అనిమఱియు శ్రీకృష్ణుఁడిట్లనియె

కం॥ ఇదె నీ కనసూయునకున్
విదితంబుగఁ జెప్పవాఁడ విజ్ఞానముతో
డఁ దగు రహస్యజ్ఞానం
బది యెఱిఁగిన ముక్తిఁ గాంతు వశుభమువలనన్. 1

కం॥ ఇది యుత్తమము పవిత్రం
బిది విద్యలరాజు ధర్మ్య మిది యవ్యయమై
నది యిది గుహ్యంబుల రా
జిది ప్రత్యక్షావగమము నిది సుకరంబున్. 2

కం॥ పరమంబగునీధర్మము
పరంతపా నమ్మనట్టివారెల్లను దా
మరయ ననుఁ బొందనేరక
నరగునఁ గూలుదురు మృత్యుసంసారమునన్. 3

కం॥ తెలియఁగనేరనిరూపము
గలనే నున్నాఁడ నీజగంబులనెల్లన్
సలి భూతంబులు నాలో
నిలుచు నయిన భూతములను నే నంటఁజుమీ. 4

కం॥ అంటవ భూతములును న
న్నంటే నాపరమయోగ ఘనతం బార్థా
యంటక భూతంబుల నే
నుంటైన సృజించి ప్రోతు నొప్పఁగ వానిఁ. 5

కం॥ ఏవిధి సర్వవ్యాపి మ
హావాయువు నిలుచు నెపుడు నాకాశమునం
దావిధి భూతము లెల్లం
దావలముగ నిలుచు నర్జునా నాలోనఁ. 6

కం॥ విను మర్జున కల్పాంతం
బున నాదగుప్రకృతి నడఁగు భూతము లెల్లఁ
జన మఱి కల్పాదిని వా
ని నెల్ల సృజియించువాఁడ నే నిక్కముగఁ. 7

కం॥ నాప్రకృతి నూని మిక్కిలి
యాప్రకృతివశమునఁ జేసి యవశంబగుభూ
తప్రకరము సర్వము యో
ధప్రవరా నే సృజించెద మరలమరలన్. 8

కం॥ వాసవి నను బంధింపద
యీసృష్ట్యాదియగుకర్మ మెద్దియుఁ దనపై
నాస యొకింతయు లేక యు
దాసీనునిఁబోలె నేను దనరుటకతసన్. 9

కం॥ ఏ నధ్యక్షుండను గా
దా నాప్రకృతి సృజియించుఁ దగ నోకుంతీ
సూనా యీసచరాచర

మైనజగము దీనఁ జేసి యది వర్తించున్. 10

కం॥ నర భూతేశుఁడ నగునా
పరభావం బెఱుఁగలేనివారైరి తా మి
ద్ధర లెక్కఁ గొనరు మూఢులు
నరరూపము దాల్చినట్టినను నరుఁ డనుచున్. 11

మత్తకోకిల

వారియాశలు వట్టియాశలు వారికర్మము వట్టిదే
వారిజ్ఞానము వట్టిజ్ఞానము వారిబుద్ధి విబుద్ధియే
వారు గొల్చుచు నుండువారలు పార్థ రాక్షస మాసురం
బౌరయంగను మోహనంబును నైనమాయన యక్కటా. 12

తరల

ధర మహాత్ములు దేవభావము దాల్చి నిర్మలచిత్తులై
యరసిచూడఁగ వేఱుచింతల నన్నిఁటిం దిగవిడ్చుచుం
బురుషపుంగవ యవ్యయుండును భూతకారణుఁ డంచు నన్
బరమభక్తి నెఱింగి కొల్తురు పౌరవాన్వయబాలకా. 13

కం॥ క్షితి నిత్యయుక్తులు దృఢ
వ్రతులై యోసవ్యసాచి వారల్ భక్తిన్
నుతిసేయుచు నతిసేయుచు
జతనంబునఁ గొల్చుచుండ్రు సతతము నన్నున్. 14

కం॥ మఱి జ్ఞానయజ్ఞమునఁ గొం
ద ఱేకభావమ్ముతోఁ బృథఙ్మతితోఁ గొం
దఱు బహుభావముతోఁ గొం
చొఱుఁ గొల్తురు నన్ను విశ్వతోముఖుఁ గష్టీ. 15

ఆ॥ వె॥ ఏను గ్రతువు యజ్ఞ మే నౌషధంబును
నేను స్వధయు నేను నేను మంత్ర
మేను హుతము నగ్ని యే నాజ్య మేఁ జువ్వె
పూరునృపకులాబ్ధిపూర్ణచంద్ర. 16

మత్తకోకిల

నేను దల్లిని నేను దండ్రిని నేను దాతను ధాత నే
నేను వేద్యము నేఁ బవిత్రము నేన యోమ్మను నక్షరం
బేను బుక్శ్రుతి యాయజుశ్శ్రుతి యేను సామము బాలకా
యేను జూ సచరాచర మ్మగునీజగత్తున కంతకున్. 17

ఉత్సాహ

నేనెగతిని నేనెభర్త నేనెప్రభువు సాక్షి నే
నేనివాస మేనెశరణ మేనెహితుఁడ దాక కే
నేనయునికి కేనెపోక కేనిధాన మవ్యయం
బైనయట్టిబీజమేన యఖిలలోకములకునుఁ. 18

ఉత్సాహ

ఏన తాప మాచరింతు నెల్లప్రాఁశికోటికిఁ
వానగురియువాఁడ నేన వానయాఁగువాఁడ నే
నేనయమృతమనెడునదియు నేనమృత్యు వేన స
త్తే నసత్తు సుమ్మి పూరునృపకులాబ్ధి చందమా. 19

మ॥ ధర వేదంబులుమూఁడునుం జదివి శ్రద్ధన్ సోమపానం బుచే
నరయం బాపమువాపి యజ్ఞముల న న్నర్చించి యాస్వర్గతిన్
గర మర్థించెడువారు పుణ్యసురలోకం బంది స్వర్గంబునఁ
నర దివ్యం బగుదేవభోగముల నెన్నం గుక్తరిష్టఁబునన్. 20

శా॥ ఆరీతిం గడుఁబెద్దకాల మటఁ బార్థా స్వర్గభోగంబులన్
వారల్ గుడ్చుచుఁ బుణ్యమెల్ల సరిపోవం భూమిపైఁ గూలుచా
రీరీతిన్ శ్రుతిధర్మ మూఁది మది నెంతేఁ గామముల్ గల్గిన
వ్వారల్ చచ్చుచుఁ బుట్టుచుండెద రిలం బర్యాయమర్యాదచేన్.21

కం॥ నర వేఱుచింత లే కె
వ్వారు నన్నే దలఁచి లెస్స భజయించెద ర
న్నిరతాభియుక్తులవి యగు
వర యోగక్షేమములను బరఁగ వహింతున్. 22

కం॥ ఇల నన్యదేవతలభ
క్తులై యెవరు భక్తిఁ జేయుదురు పూజలు వా
ర లవిధిపూర్వకముగ న
న్న లలిం బూజించి వెలసినట్టిరు సువ్వే. 23

ఆ॥ వె॥ సర్వయజ్ఞభోక్త సర్వయజ్ఞప్రభు
వేన సువ్వె వార లింతయేని
నాదుతత్వ మర్జునా యెఱుంగర యట్లు
కారణమునఁ గూలువార లకట. 24

కం॥ చనఁ బొందుచుండ్రు దేవత
లను దేవవ్రతులు పితరులను బితృనియతుల్
ఘనభుజ భూతంబుల భూ
తనియతి గలవారు నన్నుఁ దగ నాథక్తుల్. 25

కం॥ గాంఢివి యాకేఁ బువ్వేఁ
బండే నీళ్లేని నాకు భక్తినొసఁగు నె
వ్వం డావరిశుద్ధాత్మకు
మెండగు భక్తి నిడుదాని మేకొని కుడుతున్. 26

కం॥ ఏదిచేసిన నెదికుడిచిన

నెదివేల్చిన నెదియొసంగు నెదితపియింతీ

వదియెల్లం గౌంతేయా

మదర్పణం బెలమిఁ జేయుమా మదిలోనన్. 27

మ॥ చన నీరీతి వసుంధరాతలమునన్ సన్న్యాసయోగంబుచే

తను శాంతించినచిత్త మీవు గలవైఁ దథ్యంబు కీడ్మేళ్లు రెం

టిని బుట్టించెడుకర్మబంధనము క్రిందీ పీడ రాఁగల్గు ది

మ్మున నీ వప్పుడు నన్నుఁ బొందెదవు సూ ముక్తుండ వై యున్కిచే.

కం॥ నర నేను సర్వసముఁడను

విరోధియితఁ డితఁడు నాకుఁ బ్రియుఁ డని లే ది

వ్వారు నన్ను భక్తిఁ గొలుతురు

కర మే వా రొకరిలో నొకర ముందుము సూ. 29

కం॥ కరము దురాచారుం డే

ధరలోన ననన్యభక్తిఁ దగ ననుఁ గొలువం

గరము సదాచారుఁడ యనఁ

బరఁగును లెస్సగ నతండు వ్యవసితుఁ డగుటన్. 30

కం॥ వడివడి నాతఁడు ధర్మా

త్ముఁడై పడయు నిత్యశాంతి ముదమున నాభ

క్తుఁడెవండు చెడఁడు సుమ్మీ

యెడ ముమ్మాటికిని, నమ్ము మీ నామాటల్. 31

కం॥ భువిఁ బాపజాతు లాయాఁ

డువాండ్రు శూద్రులును గోమటులు దామేన

న్నవిరళభక్తిఁ గొలిచి పొం

డేవమధ్యమ పరమగతి వడయువా రనినన్. 32

కం॥ అతిపుణ్యాత్ములు భక్తులు
క్షితిపర్షులు బ్రాహ్మణులను జెప్పఁగ నేలా
క్షితియుత మసుఖం బగునీ
క్షితిఁ బుట్టితి వీవు నన్ భజింపుము బాలా. 33

మత్తకోకిల

నన్నె మానసమందు నిల్పుము నాకె సేవ యొనర్పుమా
నన్నె గూర్చి నమస్కరింపుము నాకె పూజ యొనర్పుమా
అన్న యీగతి నేనె దిక్కని యాత్మ నాపయి నిల్పితే
నన్నె పొందఁగఁ గాంతు సువ్వో ధనంజయా యిటమీఁదటన్. 34

గద్య.

ఇది శ్రీ త్రికవిమిత్ర తాడూరి రామనభట్టాగ్రపుత్త్ర
పండితారాధన మండిత లక్ష్మీనరసింహ పండిత ప్రణీతం
బైన యుపనిషత్తును బ్రహ్మవిద్యయును యోగ
శాస్త్రంబును శ్రీకృష్ణార్జున సంవాదం
బును నగు శ్రీభగవద్గీతయందు
రాజవిద్యా రాజగుహ్య
యోగ ము ను న వ
మాధ్యాయము.







## పదియవ యధ్యాయము

# విభూతి యోగము.

అని మఱియు భగవంతుండిట్లనియె.

క॥ పరమ ప్రియుఁడవుగావునఁ
బరమహితము గోరి నీకుఁ బరఁగఁగ నిపు డీ
పరమ మహావాక్యంబును
బరంతపా మరలఁ జెప్పవాఁడను వినుమా. 1

క॥ సురగణ మహర్షి గణములు
నర యెన్నం డెఱుఁగలేవు నాప్రభవముఁ దా
మరయంగ వారికెల్లం
బురుషవరా నేను మూలపురుషుఁడఁ గదవే. 2

క॥ నను నజుఁడు లోకనాథుం
డనాది యని యెవ్వఁ డెఱుఁగు నాతఁడు నరులం
దున మోహరహితుఁడై కనుఁ
జన ముక్తిన్ సర్వకిల్బిషంబులవలనన్. 3

క॥ క్షమయును బుద్ధియు జ్ఞానము
శమమును సత్యంబు మఱి యసమ్మోహంబున్
దమమును సుఖమును దుఃఖము
నమితగుణా భవ మభావ మభయము భయమున్. 4

క॥ సమతయు నహింస తుష్టియు

నమరఁ దపంబును యశంబు నయశంబును దా
నము ననుసీనానాథా
వములను భూతముల కిచ్చువాఁడను నేనే. 5

కం॥ ధర నీసకలప్రజ యె
వ్వారి దలయేడ్వురుమహర్షి వరులుం దొలిన
ల్వారు మనువులు మనమునఁ బు
ట్టిరి వా రెల్లరును గన్నవీ మద్భావుల్. 6

కం॥ ఈ నావిభూతియోగము
లోనర తత్వమున నెఱిఁగి యొనరునతఁ డిల్గా
దా నచలయోగయుక్తుం
డౌ నీయర్థమున సంశయము లే దనఘా. 7

కం॥ అంతకు నేనే మూలం

బంతయు నావలన నడచు నని మదిలోనన్
జింతించి బుధులు నను భజి
యింతురు భావంబుకలిమి యెసక మెసంగన్. 8

కం॥ నిలుపుచుఁ జిత్తముఁ బ్రాణం
బులు నాపయి నొకరికొకరు బోధించుచు ని
చ్చలు చెప్పికొనుచు నామా
టలు తృప్తి రమింతు రెచ్చూ జెడంగుగ వారల్. 9

కం॥ నిరతాభియుక్తు లగుచుం
గరము ననుం బ్రీతిపూర్వకముగఁ గొలుచున
ప్పురుషులకు బుద్ధియోగము
నర యొసఁగెద నదియ వారి ననుఁ బొందించున్. 10

క॥ వారియెడన దయచేతను
వారలభావమున నిల్చి పార్థ చెఱచెదన్
వారలయజ్ఞానజతమ
మారయ వెలుఁగొందు జ్ఞాన మనుదీపముచే. 11

వ॥ అనుటయు నర్జునుండు.

క॥ హరి నీవు పరబ్రహ్మవు
పరమ జ్యోతివియుఁ బరమపావనమవు నీన్
బురుషుఁడు దివ్యుఁడు శాశ్వతుఁ
డరయంగా నాదిదేవుఁ డజుఁడు విభుండున్. 12

క॥ అని యెల్లమునులు ననిమిష
ముని నారదుఁ డల్లవ్యాసమునియుం గృష్ణా
ఘనుఁ డాదేవలుఁ డసితుం
డును బల్కెద రట్ల నాకు నుడివెద వీవున్. 13

క॥ నీయిపుడునాకుఁ జెప్పెడి
యీయెల్ల నిజం బటంచు నే నమ్మితి నీ
దై యెసఁగువ్యక్తి భగవం
తా యెఱుఁగఁగ నగునె దేవదానవులకునున్. 14

క॥ అరయంగ నీకు నీవే
నిరతం బెఱుఁగుదువు గదవె నిను జగదీశా
కర మరిది భూతభావన
పురుషోత్తమ దేవదేవ భూతమహేశా. 15

క॥ ఘనమగు నీలోకములె
ల్లను దేనను వ్యాపి యీచు లలి స్వస్థుఁడవై
చను దాదివ్యవిభూతులఁ

దనర నశేషముగఁ జెప్పఁదగు నీ కనఘా॥ 16

కం॥ నిను నిచ్చ లెట్లు తలఁచిన
ఘనయోగీ నిన్నుఁ దెలియఁగా నగు నాకుఁ
జన నేయేభావంబుల
నినుఁ జింతింపంగవలయు నెమ్మి న్నానతిన్. 17

కం॥ వినిపింపుము నీయోగము
జనార్దనా నీవిభూతి జన మరలను నా
కును విస్తరించి నాకుం
దనివిసనద యెంతవిన్నఁ దదమృత మనఘా. 18

వ॥ అనుటయు శ్రీభగవంతుండు.

కం॥ అన్నా చెప్పెద నీకుం
బన్నుగ నాదివ్యమైనమాహాత్మ్యములం
గొన్నింటి ముఖ్యములను నే
నన్నింటిఁ జెప్పంగ నవి యనంతములు గదా॥ 19

కం॥ నే నర్జునా సమస్త
ప్రాణులహృదయముల వెలయునాత్మను మఱి యా
ప్రాణుల కుత్పత్తిస్థితి
హానిత్రితయంబు నిచ్చునట్టిఁడ నేనే. 20

కం॥ నలి నే నాదిత్యులలో
నలవిష్ణుఁడ నంశుమంతుఁడగురవి జ్యోతి
స్సులలో మరీచిని మరు
త్తులలో నక్షత్రసమితిఁ దొవఱేఁడ నరా. 21

కం॥ నానాశ్రుతులను సామము

నేనె దేవతలలోన నే వాసవుఁడన్
నేనే యింద్రియముల మన
మే నే చేతనము భూతబృందంబులలోఁ. 22

తే॥ గీ॥ రుద్రులెల్లరలో శంకరుండ నేన
యక్షరాక్షసులందేన యలధనాధి
పతిని వసువులలో నేన పావకుండఁ
బర్వతములందు మేరుపర్వతము నేన. 23

కం॥ విను మేను బురోహితులం
దనఘా ముఖ్యుఁడగు నలబృహస్పతి స్కందుం
డను నే సేనానులలో
ననఘ సముద్రుఁడ సరస్సులందున నేనే. 24

తే॥ గీ॥ విను మహామునిగణములో భృగువు నేన
వాక్కులన్నిటిలోఁ బ్రణవంబు నేన
యజ్ఞములలోన నజ్జపయజ్ఞ మేన
స్థావరంబులలో హిమశైల మేన. 25

తే॥ గీ॥ వృక్షములలోన నశ్వత్థవృక్ష మేన
రమణ సురమునులందు నారదుఁడ నేన
అరయ గంధర్వులందుఁ జిత్రరథుఁడేన
కపిలముని నేన చూ సిద్ధగణములోన. 26

తే॥ గీ॥ అమృతమునకును దోఁబుట్టువైనయట్టి
యల్లయుచ్చైశ్శ్రవం బేన హయములందు
నేన యైరావతము మేటియేనుగులందు
నవని నరులందు నేన నరాధిపుండ. 27

తే॥ గీ॥ ఆయుధములందు నేను వజ్రాయుధంబ
ధేనువులలోన నేఁ గామధేను వేన
జన్మకారణ మైనట్టిమన్మథుండ
నమర వాసుకి సర్పంబులందు నేన. 28

తే॥ గీ॥ ఏ ననంతుండ నాగులలోన నేన
వరుణుఁడను జువ్వో నీటిదేవతలలోన
నర్యముఁడ నేన పితృదేవతాలిలోన
దండులందఱలోన యముండ నేన. 29

తే॥ గీ॥ అరయ దైత్యులలోనఁ బ్రహ్లాదుఁ డేన
గణితమేసెడువారిలోఁ గాల మేన
యెల్లమృగములలోన మృగేంద్రుఁ డేన
నైన తేయుఁడఁ బక్షులలోన నేన. 30

తే॥ గీ॥ పావనముచేయువానిలోఁ బవనుఁ డేన
రాముఁడను నేన చూ ధనుర్ధరులలోన
జగతి మొసలిని నే మత్స్యజాతిలోన
నదులలోపల జాహ్నవీనదిని నేన. 31

క॥ విను సృష్ట్యాదికి మధ్యం
బున కంతంబునకు నేన భువివిద్యలలో
నను మోక్షవిద్య నేనే
ఘనవాదులవాదమెల్లఁ గవ్వడి నేనే. 32

క॥ ఆనే నక్షరములలో
మానుగ ద్వంద్వంబు నే సమాసంబులలో
నేనే యక్షయకాలము

స్థాణభుజా నేన విశ్వతోముఖధాతన్. 33

తే॥ గీ॥ సర్వహారమృత్యు వే భవిష్యములకెల్ల
నుద్భవం బేన స్త్రీలలో నురుభుజాఢ్య
నేన కీర్తిని లక్ష్మిని నేన వాక్కు-
నేన స్మృతి బుద్ధి ధైర్యంబు నేన యోర్పు. 34

తే॥ గీ॥ సామవేదంబులో బృహత్సామ మేన
యమర గాయత్రి ఛందస్సులందు నేన
నెలలలో మార్గశీర్షంబు నేన చున్నో
ఋతువులందు వసంతర్తు వేన పార్థ. 35

కం॥ నేనే వంచకుజూదం
బేనే తేజస్వి తేజ మిల జేతజయం
బేనే సాత్వికుసత్వం
బేనే. కృషికువ్యవసాయ మేనే పార్థా. 36

తే॥ గీ॥ వాసుదేవుండ నే వృష్ణివరులలోనఁ
బాండవులలోపల ధనంజయుండ నేన
మునులలోపల నలవ్యాసమునిని నేన
కవులలోపల నలశుక్రకవిని నేన. 37

కం॥ దంతుల దండము నేనే
గాండివి నీతిని జగీషగలవారికి నేఁ
బండితులజ్ఞాన మేన య
ఖండితమౌనంబు నేన కడుగుహ్యములన్. 38

తే॥ గీ॥ ఎల్లభూతంబులకు బీజ మెద్ది యయ్యె
వల్లయది నేన తెలియుమా తెల్లముగను

అన్ను నే లేకయుండెడినట్టి దాచ
రాచరం బగు భూత మెం దరయ లేదు. 39

కం॥ విను నాదివ్యవిభూతుల
కును నంతము లేదు గదవె కుంతీపుత్రా
చన నీవిభూతివిస్తర
మును జెప్పితి నేకదేశముగఁ జూ నీకున్. 40

కం॥ ఎయ్యది విభూతిమంతం
బెయ్యది యూర్జితము జగతి నెది శ్రీమంతం
బయ్యది మత్తేజోంశజ
మయ్యోస యని మది నెఱుంగుమా సత్వములన్. 41

కం॥ కా కీమాహాత్మ్యంబుల
నేకంబులయెఱుక నీ క దేల నరా యీ
లోకంబు లెల్ల నెఱుఁగుము
యేకాంశంబునను నిండి యెసఁగినవాఁడన్. 42

గద్య

ఇది శ్రీత్రికవిమిత్రి తాడూరి రామనభట్టాగ్రిపుత్రి పండితారాధన మండిత లక్ష్మీనరసింహ పండిత ప్రిణీతంబైన యుపనిషత్తును బ్రిహ్మావిద్యయును యోగశాస్త్రంబును శ్రీకృష్ణార్జున సంవాదంబును నగు భగవద్గీతయందు విభూతి యోగమను దశమాధ్యాయము.





భగవద్గీత.

పదునొకండవ యధ్యాయము.

# విశ్వరూప సందర్శన యోగము.

ఇట్లు భగవంతుండు పల్కుటయు నర్జునుండు.

కం॥ ననుఁ బ్రోవ నిపుడు నీచె
ప్పినయధ్యాత్మ మనునట్టిపేరఁ బరఁగున
ప్పరమరహస్యపు వాక్యము
విన నాయీమోహబుద్ధి వికలం బయ్యెన్. 1

కం॥ వినిపించితి భూతంబుల
జననంబును నాశనంబు జలజాక్షా నీ
ఘనశాశ్వతమాహాత్మ్యం
బును నాకు సవిస్తరముగ బుద్ధిం దెలియన్. 2

కం॥ సరె యిదిసరె గాని మహా
పరమేశ్వర నిన్ను నెట్లు వర్ణించితివో
పురుషోత్తమ యానీదై
శ్వరరూపముఁ జూడఁ గోరువాఁడం జుమ్మీ. 3

కం॥ కన నది నాకున్ శక్యం
బని నీమదిఁ దలఁచె దేని యయ్యా ప్రభువా
ఘనయోగేశ్వర నీ దా

ఘనసౌమ్యయుఁ బైనరూపుఁ గనఁబఱపఁగదే. 4

అనుటయు శ్రీభగవంతుండు

కం॥ పలుఁదెఱఁగులు దివ్యంబులు
పలువర్ణాకృతులు నగుచుఁ బార్థా పలునూ
ఱులకోలఁది వేలకోలఁదిన్
వెలసెడునారూపు లివియె నెమ్మిం గనుమా 5

కం॥ నలి నాదిత్యుల రుద్రుల
నలవసువుల వాయువులను నశ్వినుల నిఁకం
దొలి యెన్నఁడు చూడనివిం
తలు పెక్కులఁ జూడుమా పృథాదేవిసుతా. 6

కం॥ కనుమా యిదె నానెమ్మే
నను సచరాచరము జగము నలి వెల్గెడు నె
ల్లను నొకచక్కిన మఱి యిఁకఁ
గన వలచెడువాని నెల్లఁ గనుమా పార్థా 7

కం॥ ఈనీకన్నులతోడను
గానంగా లేవు నన్నుఁ గావునఁ బార్థా
నే నిత్తు దివ్యదృష్టిం
దానఁ గనుమ యైశ్వరమ్ము నాయోగంబున్. 8

కం॥ అని పలికి తోడనే పా
ర్థున కైశ్వర మైనపరమరూపం బెల్లం
దనర మహాయోగేశ్వరుఁ
డనఘుఁడు హరి చూపెఁగదవె యవనీనాథా 9

కం॥ పలుమోములు పలుఁగన్నులు

పలువింతలదర్శనములు పయి కెత్తినవై
వెలిగెడుపలుదివ్యాయుధ
ములు ధగధగ మెఱయు దివ్యములు పలుసొమ్ముల్. 10

తే॥ గీ॥ కలిగి దివ్యమాల్యాంబరంబులు ధరించి
దివ్యగంధం బలఁది మేన దేవమయి య
నంత మాశ్చర్యమయమును నగుచు విశ్వ
తోముఖం బయి యారూపు తోఁచె నధిప. 11

కం॥ దివి వేవురైన సూర్యుల
దవు వెలుఁ గొక్కటను లేచునది యయ్యె న యే
నవు సాటి యది యనం దగు
భువిలో నవ్విశ్వరూపము వెలుఁగుతోడన్. 12

కం॥ కనె నపుడు వేయివే లయి
యనేకవిధములయి వెలుఁగునంతజగంబున్
జను దేవదేవు నెమ్మే
నను బాండవుఁ డొక్కచక్కి నరనాథ మణీ. 13

కం॥ కని మేను గగుర్పొడువం
గను నివ్వెఱ శిరము వంచి కరములు ముకుళిం
చి నమస్కరించి యద్దే
వునితో నిట్లనియె నతఁడు భూపశ్రేష్ఠా 14

చం॥ కనియెద దేవ నీదుఘనకాయమునందు సమస్తదేవతా
లిని మఱి పద్దెఱంగుల వెలింగెడునట్టియశేషభూతకో
టిని సభ పద్మపీఠమున శివిని దీర్చినయట్టిబ్రహ్మదే
వునిఁ దగ దివ్యమానురగపుంజము సర్వమునిప్రపంచమున్. 15

మత్తకోకిల.

పెక్కుఁజేతులు పెక్కుఁగడ్పులు పెక్కుమోములు నేత్రముల్
పెక్కు దాలిచి కానిపించెదు పెక్కురూపుల నెల్లెడన్
నిక్క మిప్పుడు విశ్వరూపుఁడ నీకు నంతము మధ్య మా
యిక్క యాదియుఁ గానిపింపవ యెందు నోజగదీశ్వరా. 16

మ॥ ఘనతేజంపుఁగిరీటముం గదయుఁ జక్రం బొప్పఁగా దీప్తిఁ బొ
ల్చునినాగ్నిప్రభ నప్రమేయుఁ డయి తేజోరాశి వై యెల్లచో
ట్లను బెంపారఁగఁ బెద్ద ప్రజ్వరిలుచుంటం దుర్నిరీక్ష్యుండ వై
యనఘా యెల్లెడఁ గానిపించెదవు నాదైనట్టియీకంటికిన్. 17

మ॥ పరమంబై చనునక్షరం బనుచుసుం బ్రహ్మాండభాండాలికిం
బరమంబైననిధాన మంచు నెద దేవా యవ్యయుం డంచు ని
న్ను రహిన్ శాశ్వతధర్మగోప్తయుఁ బురాణుండైనయాత్మం డటం
చు రతిన్ లోక మెఱుంగఁగావలయు నంచు న్నేను భావించెదన్.

మ॥ అనఘా యాదియు మధ్య మంతమును లే కాదిత్యచంద్రాక్షి వై
యనిశానంతపరాక్రముండ వయి యాద్యానంతబాహుండ వై
యినసందీప్తమహాగ్నివక్త్రుఁడవు నై యీలోకము న్నేఁడు నీ
ఘనమౌతేజముతోడఁ గాల్చుచు బళా కాన్పించుచున్నా విటన్.

మ॥ అనఘా నిండెను నేఁడు చూడఁగ మహాత్మా భూనభోమధ్యమె
ల్లను నీయొక్కనిచేతనే దిశలు నెల్లం జూడఁగా నట్ల నిం
డెను జూ మ్మద్భుత ముగ్ర మై వెలుఁగునీనీరూపముం గంటితోఁ
గని లోకత్రయ మెల్లనుం జెడవడంకం జొచ్చెఁ గన్గొంటివే. 20

మత్తకోకిల

పౌనర నీసురసంఘముల్ నినుఁ బొందె నిప్పుడు భీతిచే

తను గరంబులు మోడ్చి కొందఱు తద్గ గీర్తన సేయువా
రనఘ నీకు జయుంబటంచు మహర్షి సిద్ధసమూహముల్
పొనర స్తోత్రము సేయువారలు పుష్కలస్తవరాజిచే. 21

మ॥ విను మేకాదశరుద్రసిద్ధులును విశ్వేదేవతల్ రాక్షసుల్
చనఁ బన్నిద్దఱుసూర్యు లష్టవసువుల్ సాధ్యాశ్వినీదేవతల్
ఘనులౌ యేడ్వురువాయువుల్ పితరులుం గంధర్వయక్షాళు లో
యనఘా యెల్లరు నిన్నె చూచెదరు తా మాశ్చర్యమగ్నాత్ములై.

మత్తకోకిల.

పెక్కుమోములు పెక్కుఁగన్నులు పెక్కుబొజ్జలునుం దొడల్
బెక్కుఁజేతులు పెక్కుఁగాళ్లులు భీకరంబగు కోఱలున్
బెక్కు గల్గి వెలుంగునీదగు పెద్దరూపముఁ జూచి యి
పైక్కుడొభయ మందినారమ యెల్లలోకులు నేనునున్. 23

మ॥ తెఱపంబడ్డయనేకవక్త్రములతో దేవేశ దీప్తంబులై
మెఱయుం జొచ్చువిశాలనేత్రములతో మిన్నంటి పల్వన్నెలన్
మెఱయుం దాలిచి వెల్గుని న్నిపుడు సామీ కాంచి నానెమ్మదిన్
వెఱపుం జెందితి ధైర్యమున్ శమమునున్ వీడెంగదా యక్కటా. 24

కం॥ అల కాలానలసన్నిభ
ములు హరిదంష్ట్రా కరాళములు నగునీమో
ములు చూడఁ గానఁబడవు ది
శలు వేగ్రఁగ యెయ్యేమది కిఁకఁ బ్రసన్నుఁడ వగుమా. 25

త॥ అనఘ యీధృతరాష్ట్రనందను లందఱుం గుమి గూడి యీ
జనవరేణ్యులగుంపుతోడను జాపశిక్షకుదోణుతో
ఘనుఁడు స్వర్ణదిపుత్రుతోడను గర్ణుతోడను మాబలం
బున వెలుంగుచునున్న వా రగుముఖ్యయోధులతోడుతన్. 26

చం॥ వడివడి దేవదేవ యిదె వక్త్రపుఁగోటులతో వెలుంగునీ
బెడిదపునోళ్లలోనఁ గడువింతగఁ జొచ్చుచు నున్నవా రిటం
దడయక కొంద ఱం దకట దంతపుసందులలోనఁ జిక్కి క
న్పడియెడివారు పెందలలు వ్రియ్యలుఁ జూర్ణము లౌచునుండఁగన్.

మ॥ కనఁగా నెట్లు నదీప్రవాహము లనేకంబుల్ సముద్రంబులో
ననఘా తా మెదు రేగి చొచ్చు భువిపై నత్యంత శీఘ్రంబుగా
ఘనులౌనీనరలోకవీరులును శీఘ్రఁబాగతిం దేవ య
ట్లనలి న్నీవగుప్రజ్వలించు పలునోళ్లం జొచ్చుచున్నా రిదే. 28

చం॥ మిడుతలు లోకమం దకట మిక్కిలి మండెడు మంటలోపలన్
వడివడి చేటుమూఁడి బహుభంగుల వ్రాలెడునట్టిపోలికన్
వడివడి దేవ నీవెడఁదవాతులలోపల లోకు లెల్లరుం
బడియెడువారు నేఁడు బహుభంగులఁ దాముఁను నాశనార్థమై. 29

మత్తకోకిల.

మండుచుండెడినోళ్ల తోడ సమగ్రమాగతి లోకులన్
మెండుగాఁగను నెల్లచక్కల మెక్కి నాల్కల నొల్లెదే
నిండి మెండుగ లోక మెల్లను నీదు తేజముతోడుతన్
మండుచున్నది యుగ్రకాంతి నమందమాగతి వెన్నుఁడా. 30

మత్తకోకిల.

చెప్పు మెవ్వఁడ వుగ్రరూపముచే వెలింగెదు దేవ నీ
విప్పు డిక్కడ నీకు మ్రొక్కెద నేను నం దయఁ జూడవే
యిప్పు డేమియు నీప్రవృత్తిని నే నెఱుంగన యాద్యు ని
న్నొప్పుగా నెఱుఁగంగఁ గోరెద నొయ్య నానతి యియ్యవే. 31

అనుటయుశ్రీభగవంతుండు

తే॥ గీ॥ ఏను విను జగత్త్రయకృత్ప్రవృద్ధకాల
మే నిపుడు లోకహరణార్థవృత్తి నుంటి
వైరిసేనలలో నొక్కఁడీరుఁ డైన
బ్రదుకఁబోఁడీవు విడిచినవాఁడ వైన. 32

తే॥ గీ॥ కావునను లెమ్ము వేగ పగఱ జయించి
యశము గాంచు సమృద్ధరాజ్యంబు ననుభ
వింపు నాచేత నే మున్న వీరు వడిరి
కవ్వడి నిమిత్తమాత్రమ్మ కమ్ము నీవు. 33

తే॥ గీ॥ పార్థ నాచేతఁ జంపంగఁబడినయట్టి
ద్రోణభీష్మకర్ణజయద్రథులను దక్కఁ
దండిమగలను జంపుమా బెండువడకు
యుద్ధమాడుము గెలుతీవుయుద్ధమందు. 34

కం॥ అన విని కిరీటి వడఁకుచుఁ
దనచేతులు మోడ్చి మ్రొక్కి తద్దయు భీతిం
బ్రణతుఁడయి గద్గదస్వన
మున నిట్లనెఁ గృష్ణుతోడ భూవర మరలన్. 35

మ॥ అనయంబు న్నినుఁ బ్రస్తుతించి సకలం బైనట్టిలోకంబులో
యనఘా తాము ప్రహర్ష మందుటలు నత్యంతానురాగంబులం
గనుటల్ బెగ్గిలి దిక్కుదిక్కులకు రక్షస్సంఘముల్ పాఱుటల్
ఘనసిద్ధాళులు నీకు మ్రొక్కుటలు యుక్తంబె గదా కేశవా. 36

ఉ॥ ఎన్న జగద్గరిష్ఠుఁడవు నిమ్మగ బ్రహ్మకు నాదికర్తవై
యున్ననిను న్మహాత్మ యెటు లొప్పరికింతుర నమస్కరింప ౕ౦

దున్నదనంగ లేదనఁగ నొప్పెడు దాని కతీతమూర్తివై
యున్నమహాత్ముఁడండవు మహాగ్రి యనంత జగన్నివాసుఁడా. 37

మత్తకోకిల

ఈవు చూడఁగ నాదిదేవుఁడవే సనాతనపూరుషుం
డై వెలింగెడువాఁడ వీజగమంతకుం గుదురీవెసూ
యీవె వేత్తవు నీవె వేద్యమవే పరంబగుధామమున్
నీవె నీవె యనంత విశ్వము నిండియుండినవాఁడవున్. 38

శా॥ ఈవే వాయువునుం బ్రజాపతియు నీవే యగ్ని నీవే యముం
డీవేయాప్రపితామహుండు వరుణుండీవే సుధాంశుండవీ
వే వేమాఱులు నీకు మ్రొక్కెదను నీకే మ్రొక్కెదన్ మ్రొక్కులన్
నీ వే వెండియు నీకు మ్రొక్కెదను నే వే వెండియున్ మ్రొక్కెదన్

ఉత్సాహ

సర్వ నీకు మ్రోల నుండి చక్క వెన్క నుండి యున్
సర్వదిక్కులందు నుండి సల్పెద న్నమస్కృతుల్
సర్వమం దనంతవీర్య చక్క నీవు వెలయుటన్
సర్వుఁడైతి చూడఁగాఁ జనంగ నమితవిక్రమా. 40

కం॥ తెలియక నీయామహిమను
చెలివని బ్రమసి నినుఁ "గృష్ణ" "చెలి" "యాదవ" యం
చిలను బ్రమాదప్రణయం
బులఁ జులుకన పిలిచినట్టిపొనుఁగుఁబిలుపులున్. 41

ఆ॥ వె॥ అయ్యొ నే విహారశయ్యాసనాహార
కాలములను నవ్వులాల కొంటి
నున్నఁ బదుగురున్న నిన్ను మన్నింపమి

యచ్యుతా క్షమింపు మప్రమేయ. 42

తే॥ గీ॥ ఈచరాచరజగమున కెల్లఁ బితవు
పరమగురుఁడవు పూజ్యుఁడ వరయ నీకు
మూఁడులోకంబులం దీడు లేఁ డధికుఁడు
మఱి యిఁకెందుండు నప్రతిమప్రభావ. 43

కం॥ కావున సాఁగిలి మ్రొక్కెద
దేవా దయఁజూడు కొడుకుది చెలిది ప్రియదీ
డ్యా వసుధఁ దండ్రి చెలి మగఁ
డేవిధి నాతప్పు నట్టులే సైఁపఁదగున్. 44

కం॥ మును జూడని యీరూపముఁ
గని తనిసితిఁ గాని మనము కడు వడఁకెడు భీ
తిని జూపుము యీరూపమ
ఘన దేవ జగన్నివాస కరుణింపు తగన్. 45

కం॥ కనవలచెద నట్లే గద
యును జక్రికిరీటములును నొప్పెడు నిన్నన్
జన నాచతుర్భుజుండవ
యనంతభుజ విశ్వరూప యాఁపటఁ గమ్మా. 46

తరల

ఒనర నట్టులె చక్రముం గద యుం గిరీటము దాల్చుని
న్ననఘ నే వలతు న్మనంబునయందుఁ జూడఁగ నిప్పుడే
చన భుజంబులు నాల్గు గల్గి ప్రసన్న మానలరూపమే
యనఘ తాల్పవె విశ్వమూర్తి సహస్రబాహువు చెచ్చెఱన్.

ఇట్లర్జునుండుపలుకుటయు శ్రీభగవంతుండు

కం॥ చన విశ్వము తేజోమయ
మనంత మాద్యంబు పరమ మన్యుఁ డెపుడు గా
నని దీరూపము నీ క
ర్జున నాయోగంబుచేతఁ జూపితిఁ గరుణన్. 47

కం॥ నలి నీరూపంబున న
న్నల ఘోరతపముల వేదయజ్ఞాధ్యయనం
బుల దానంబుల గర్మం
బులఁ జూడఁగఁ జాల రన్యపురుషులు ధరణిన్. 48

కం॥ ఈనాభీకరరూపము
చే నీకుఁ భయము పుట్టి చిత్తము బ్రమసెన్
గాన భయ మేది యొలమిన
యీనారూపంబ చూడు మది యిదె మరలన్. 49

ఉత్సాహ

అనుచు నామహాత్ముఁ డైనయట్టివాసుదేవుఁ డో
యనఘ చల్లనౌశరీర మమరఁ దాల్చి వేగ మ
ర్జునున కపుడు తనదురూపుఁ జూపి మరలఁ గరుణతో
ననునయించె వెఁగడుపడియవాని భూవరా. 50

కం॥ మానుష మై సౌమ్యం బగు
నీనీరూపంబుఁ జూచి యిప్పుడు వదిలెన్
నానిశ్చేష్టత కుదుటన్
మానసముం బడియెఁ బడితి మనుజులలోనన్. 51

అనుటయు శ్రీభగవంతుండు

కం॥ ఏవిశ్వరూప మర్జున
నీ విప్పుడు చూడఁ గలిగి నెగడితి విం దే
యావిశ్వరూప మనిశము
దేవతలుం జూడఁ గా మది న్వాంతురుసూ. 52

కం॥ ఏగతిరూ పగునను గనఁ
గాఁ గలిగితి వట్టినన్నుఁగవ్వడి చూడం
గాఁ గాదు వేదములచే
మూఁగతపస్సులను దానముల యజ్ఞములన్. 53

తే॥ గీ॥ శ్వేతవాహన యీరీతి విశ్వరూప
ధరుఁడ నగునన్నుఁ జక్కఁగాఁ దత్త్వమునను
నన్యమెఱుఁగనిభక్తిచే నైన వే యె
ఱుంగఁ జూడంగ మఱియుఁ బొందంగ వచ్చు. 54

ఉత్సాహ

నన్నుఁ గూర్చి కర్మముల్ చనంగ సల్పి పరముఁ డం
చెన్ని నన్ను భక్తి గొల్చి యెల్లసంగజాలముల్
పన్నుగాను విడిచి పగలు ప్రాణికోటియెల్లమీఁ
ద న్నరా యడంచువాఁడు తనర నన్నుఁ బొందుఁజూ. 55

గద్య.

ఇది శ్రీ త్రికవిమిత్ర తాడూరి రామనభట్టాగ్రపుత్ర పండితా
రాధన మండిత లక్ష్మీ నరసింహపండిత ప్రణీతంబైన యుప
నిషత్తును బ్రహ్మవిద్యయును యోగ శాస్త్రంబును
శ్రీకృష్ణార్జున సంవాదంబును నగు శ్రీ భగవద్గీ
తయందు విశ్వరూప సందర్శన యోగ
మను నేకాదశాధ్యాయము.

# భక్తి యోగము

పండ్రెండవ యధ్యాయము.

వ॥ అని చెప్పుటయు నర్జునుండు.

ఉత్సాహ.

భక్తు లెవరు నిన్నుఁ గొల్చి వసుధలోన నిరతమున్
యుక్తు లౌచు వారిలోన నొనర నక్షర మగు న
వ్యక్తమున్ స్మరింతు రెవరు వారిలోన యోగముల్
భక్తవత్సలా యెఱుంగువార లెవరు లెస్సగన్. 1

వ॥ అని యడుగుటయు శ్రీభగవంతుం డిట్లనియె.

కం॥ నర నిత్యయుక్తు లై యె
వ్వరు నాపై నిలిపి మనముఁ బరమశ్రద్ధన్
బరఁగ నుపాసింతురు వా
రె వరయోగులు నాకు మనసువచ్చినవారల్. 2

కం॥ విను మక్షరము నచింత్యం
బును సర్వత్రగము నచలమును గూటస్థం
బు ననిర్దేశ్యంబు ధ్రువం
బు నైనయవ్యక్తమును నమోఘభుజబలా. 3

కం॥ కరము జితేంద్రియు లై యె
వ్వా రెల్లెడం దుల్యబుద్ధి వడిఁ బ్రాణిసము
త్కరహిత మరయు చుపాసిం
తురు వారలు నన్నె పొందుదురు సూ పార్థా. 4

తే॥ గీ॥ ధరణి నవ్యక్తసక్తచేతస్కులకును
నధికతర మైనక్లేశంబు లావహిల్లు
నకట దేహాభిమానులౌనట్టిరికిని
బడయ నవ్యక్తగతి చాలఁగడిఁది గద వె. 5

తే॥ గీ॥ పార్థ నాకెల్లకర్మ. మర్పణముసేసి
నన్నె పరమమౌ గతి గాఁగ నమ్మి యెడఁగ
నన్య మెఱుఁగని యాయోగ మభ్యసించి
చింతచేయుచు న న్నుపాసింతు రెవరు. 6

తే॥ గీ॥ అట్టినామీఁద మన సుంచునట్టి రైన
వారలను మృత్యుసంసారవార్ధి నుండి
సరభసం బగుగతితోడ సవ్యసాచి
వత్సలత నుద్ధరించెదువాఁడ నగుదు. 7

కం॥ నామీఁదనె మది నిల్పుము
నామీఁదనె బుద్ధి యర్జునా నిల్పుము నీ
వీమీఁద నన్నె కలసెద
వేమి యు సందియము వలవ దిందుఁ బడంగన్. 8

కం॥ ఇప్పుడు నీమది స్థిరముగఁ
దప్పక నామీఁద నిలుప దార్ఢ్యము లే దేఁ
జెప్పెద విను ననుఁ బొందఁగ
నొప్పఁగ నభ్యాసయోగయుతుఁడవు కమ్మా. 9

తే॥ గీ॥ అట్టు లభ్యాసముం జేయ నైన శక్తి
పరఁగ లే దేని మత్కర్మపరుఁడ వీవు
కమ్ము కర్మముల్ నానిమిత్తమ్ము సేసి

తేనియును బొందఁగలవు సుమ్మీ వృసిద్ధి. 10

కం॥ ఇది యును జేయఁగలేవే
హృదిలో నాయోగ మాశ్రయించి కిరీటీ
పదపడి నియతాత్ముఁడ వై
వదలఁగదే సర్వకర్మఫలజాలంబుల్. 11

కం॥ విమలజ్ఞానం బభ్యా
సమునకు మఱిధ్యానమల్లజ్ఞానమునకు ధ్యా
నమునకుఁ గర్మఫలత్యా
గ మెక్కుడలదాన శాంతి కలుగునుజుమ్మీ. 12

తే॥ గీ॥ వైరభావంబు దాల్ప కేప్రాణులకును
గరుణయును మైత్రియును రెండు గలిగి తాను
దనది యను రెండు లేకెల్లతఱిని సమత
నుర్వి సుఖదుఃఖములఁ గుప్పు చోర్పు గలిగి. 13

తే॥ గీ॥ ఎల్లతఱి సంతసం బంది యెసఁగువాఁడు
యోగి యగువాఁడు దృఢనిశ్చయుఁడు జితేంద్రి
యుఁడు మదియు బుద్ధి నామీఁద నుంచినట్టిఁ
డైన భక్తుఁడు నా కిష్టుఁ డైనవాఁడు. 14

కం॥ ఎవ్వని కులుకదు లోకం
బెవ్వఁడు లోకముల కులుకఁ డెలమి యు నలుకల్
నివ్వెఱ యుఁ దిప్ప త్రిప్పల
నెవ్వఁడు వడకుండు నాతఁ డిష్టుఁడు నాకున్. 15

కం॥ అనపేక్షుఁడు శుచి యగువాఁ
డు నుదాసీనుండు దక్షుఁడు ను నిర్బాధుం

డును సర్వయత్నవర్జితుఁ
డునై వెలుఁగునాదుభక్తుఁడు ప్రియుఁడు నాకున్. 16

కం॥ కూరిమి యలుక యు వగ యును
గోరిక యును లేక గొంతికొడుకా యిది మే
లారయఁ గీడిది యన కొ
ప్పారెడునలభక్తుఁ డిష్టుఁ డన్నా నాకున్. 17

కం॥ ఇది మానం బవమానం
బిది యన కితఁడు చెలి పగతుఁ డితఁ డనక సుఖం
బిది యిది కష్ట మనక వేఁ
డిది చలి యిది యనక సంగ మెడలినవాఁడై. 18

కం॥ తనుఁ దిట్టినఁ బొగడినఁ బడు
చును మానము దాల్చి తనియుచును దేననునై
న ని దిల్లు ప్రవాసం బిది
యనక మనసు నిల్పుభక్తుఁ డగు నాప్రియుఁడే. 19

కం॥ పరమశ్రద్ధను నన్నే
పరమునిఁగా నమ్మి యిపుడు పలికినదగుని
ప్పరమధర్మ్యామృతంబా
చరించుభక్తు లతిహితులు జగతి న్నాకున్. 20

గద్య.

ఇది శ్రీత్రికవిమిత్ర తాడూరి రామనభట్టాగ్రపుత్ర పండితా
రాధనమండిత లక్ష్మీనరసింహపండిత ప్రణీతంబైనయుప
నిషత్తును బ్రహ్మవిద్యయును యోగశాస్త్రంబు
ను శ్రీకృష్ణార్జున సంవాదంబును నగు
శ్రీభగవద్గీతయందు భక్తియోగమను
ద్వాదశాధ్యాయము.

# పదుమూఁడవయధ్యాయము

క్షేత్రక్షేత్రజ్ఞవిభాగ యోగము.

శ్రీ భగవంతుండిట్లు చెప్పుటయు నర్జునుండు

ఆ॥ వె॥ క్షేత్రమనఁగనెద్ది క్షేత్రజ్ఞుఁడనునెవ్వఁ
డెద్దిప్రకృతియనఁగ నెవఁడుపురుషుఁ
డనఁగ నెద్దిజ్ఞానమనఁగ జ్ఞేయంబన
నెద్ది తెలియవలతు నెఱుఁగఁజెప్పుము. A

వ॥ అనియడుగుటయు శ్రీభగవంతుండిట్లనియె

కం॥ విను మీదేహము క్షేత్రం
బనఁబడు నిదియెవ్వఁడెఱుఁగు నాతని ధరలో
నను దజ్జ్ఞులెనయువ్వా
రనఘా క్షేత్రజ్ఞుఁ డంచు నందురు సువ్వే. 1

కం॥ నలి నెల్ల క్షేత్రములలో
పల నే క్షేత్రజ్ఞుఁడంచుఁ బరఁగ నెఱుఁగుమా
యిలలో క్షేత్రక్షేత్ర
జ్ఞులభేదంబెఱుక యెఱుక సూవె కిరీటీ. 2

తే॥ గీ॥ ఎద్దియాక్షేత్ర మెట్టిది యేవికార
మందుచుండు నదెవనిచేనగుచునుండె
వండలయుతండు నేప్రభావంబువాఁడు
వినుము సంక్షేపముగ వినుపింతు దాని. 3

తే॥ గీ॥ ఋషులు పద్దెఱఁగులను వర్ణించినారు
వివిధఛందస్సులును జెప్పి వేఱువేఱ
కార్యకారణములు సూపి కరము నిశ్చ
యమ్ముగా బ్రహ్మసూత్రవాక్యములు దెలిపె. 4

కం॥ పంచమహాభూతంబులు
నంచితముగ మాయ బుధ్యహంకారములున్
బంచేంద్రియగోచరములు
పంచమిపటి యింద్రియములుపదియు నొకటియున్. 5

కం॥ సుకము ను గష్టము పగ కో
రికయును దెల్వియును మఱియు ధృతి శారీర
ప్రకరము నివి క్షేత్రము త
త్సకలవికారము లటనిరి సంక్షేపముగన్. 6

కం॥ తను నధికుఁడనికొనమి యో
ర్పును దంభములేమి శౌచమును దిన్నఁదనం
బు నహింస మనోనిగ్రహ
మును గురుసేవయును స్థైర్యమును గౌంతేయా. 7

తే॥ గీ॥ విషయములమీఁద వైరాగ్యవృత్తి కలిమి
ప్రణతవైరి యహంకారగుణములేమి
చావు పుట్టువు రుజయు ముసలితనమ్ము
సంగుచుండెడుదుఃఖదోషముల యెఱుక. 8

కం॥ సంగములేమియుఁ గొడుకా
లుం గృహ మివిమొదలుగాఁగలుగువానికి నె
ల్లం గడు దొల్లమి యెన్నం

దుం గీళ్ళె బ్లొక్క-గతిఁ గుడువఁగాఁదలఁపున్. 9

కం॥ తన రెడుననన్యయోగం
బున నాపై శుద్ధభక్తిఁపొంసిరియును ని
ర్మనుజపరిదేశమందున
నునికియు జనసంఘయోగమొల్లమి మఱియున్. 10

కం॥ మానితనిత్యాధ్యాత్మ
జ్ఞానమునికి తాత్వికంపుజ్ఞానార్థంబుం
గానుట యనునివియెల్లం
జ్ఞానం బజ్ఞాన మనిరి జగతి నితరముల్. 11

తే॥ గీ॥ ఇంక మోక్షంబు నెయ్యది యియ్యఁజాలు
నల్లజ్ఞేయంబు వర్ణింతు నది యనాది
మత్పరబ్రహ్మ మలదానిమహిమ వినుము
యది యసత్తును సత్తు గా దనఁగఁబరఁగు. 12

కం॥ ఎల్లెడఁ గాళ్లేతులునై
యెల్లెడఁ దలలు మొగము లయి యెల్లెడఁ గను లై
యెల్లెడఁ జెవు లై లోకం
బెల్లెడ వ్యాపించియుండు నేకాలంబున్. 13

ఉత్సాహ.

కరణ మొకటి లేక సర్వకరణగుణవికాసమై
యరయ నొకటి యంటకుండి యన్ని మోచుచున్న దై
నరుఁడ గుణము లేని దయ్యు నలి నిను గుణభోక్తయై
పరఁగుచుండుఁ జువ్వె యల్లబ్రహ్మ మోపరంతపా. 14

కం॥ నలి నది ప్రాణులలోపల

వెలుపలఁ జర మచర మాచు వెలుఁగును దానిం
దెలియ నశక్యము సూక్ష్మత
కలిమిని నది చెంతనుండుఁ గడుదవ్వుందున్. 15

తే॥ గీ॥ ప్రాణులందున నది పంచఁబడనిదయ్యుఁ
బంచఁబడ్డట్లు నిలిచి తా వఱలుచుండి
ప్రాణికోటులనెల్ల నోపాండవేయ
తాన పుట్టించుఁ దాఁ బెంచుఁ దాన మ్రింగు. 16

కం॥ అది యెల్ల వెలుఁగులకు వెలుఁ
గది చీఁకటికంటె వేఱ యది యెఱుక యెఱుం
గఁదగినదది యెఱుకఫలం
బది యదియన్నింటిహృదయమందున నిలుచున్. 17

తే॥ గీ॥ ఇట్లు సంగ్రహముగ క్షేత్ర మెఱుక యెఱుఁగఁ
దగినదానిని జెప్పితిఁ దనర నీకు
దీని నెఱుఁగుచు నాభక్తుఁడైనవాఁడు
పొందఁగలఁడు నాభావంబు పురుషవర్య. 18

ఆ॥ వె॥ క్షేత్రమైనప్రకృతి క్షేత్రజ్ఞుఁడై నట్టి
పురుషుఁడును ననాది యరసి చూడ
నలవికారములును నల్లగుణంబులు
ప్రకృతిసంభవములు, పాండవేయ. 19

తే॥ గీ॥ కార్యకారణముల నెల్లఁ గలుగఁజేయ
హేతువైనది యల్లప్రకృతి యటండ్రు
పొడముసుఖదుఃఖముల నెల్లఁ గుడువఁగాను
బూరుషర్షభ హేతువు పురుషుఁ డండ్రు. 20

ఆ॥ వె॥ ప్రకృతియందునిలిచి ప్రకృతిసంభవగుణం
బులను గుడుచుచుండుఁ బురుషుఁ డతఁడు
గుణములందుఁగలతగులముచేతను బుట్టు
చుండుఁ బుణ్యపాపయోనులందు. 21

కం॥ నర విను మీదేహంబునఁ
బురుషుఁ డుపద్రష్ట భర్త భోక్తయును మహే
శ్వరుఁడును బరమాత్ముం డై
పరుఁ డై యనుమంత యగుచు భాసిలుచుండున్. 22

కం॥ ఈవిధముగాఁగఁ బొందు
తన్మావరసుత పురుషుఁ బ్రకృతి మఱిగుణములు తా
నేవాఁ డెఱుంగఁగలఁ డిల
నావాఁ డెట్లున్న జన్మమందఁడు మరలన్. 23

కం॥ కొందఱు మది ధ్యానముచే
తం దగఁ బరమాత్ముఁ గందు్రి తమకుందారే
కొంద ఱలసాంఖ్యయోగము
నం దగఁ గార్మికముచేత నర కొందఱునున్. 24

కం॥ ఇలఁ గొంద ఱిట్లెఱుంగక
వలచి యుపాసింతు రొరులవలన వినుచుఁ జ
న్మలవారును సంసారము
సాలవక దాఁటుదురు తాము శ్రుతిరతులగుటన్. 25

కం॥ తలఁపఁగ స్థావరజంగమ
ములయందునఁ బుట్టునెట్టిభూతం బైనం
గలుగును క్షేత్రక్షేత్ర

జ్ఞులసంయోగంబువలనఁ జూవె కిరీటీ. 26

కం॥ చెడుసకలభూతములలోఁ
జెడకయ పరమేశ్వరుండు స్థిరుఁడై తా ని
ల్చెడువాఁడు సమముగాఁ గ
న్గొడి యిది యెవ్వాఁ డెఱుంగు వాఁడే యెఱుఁగున్. 27

కం॥ అన్నిఁట సముఁ డై యీశ్వరుఁ
డున్నాఁ డని యెవ్వఁ డెఱుఁగుచుండు నతఁడు తాఁ
దన్నుం జెఱుపఁడు కావున
నున్నతమా పరమపదము నొందుంగద వే॥ 28

తే॥ గీ॥ సకలకర్మముల్ ప్రకృతిచే సల్పఁబడును
గాని యింతైనఁ బురుషుండు కర్తగాఁ డ
టంచు నెవ్వాఁడు శ్వేతవాహన యెఱుంగు
వాఁడె సూవె యెఱుకగలవాఁడు సూడ. 29

కం॥ భూతములెల్లను వేర్వే
ఱై తావొక్కటఁ బుట్టి యంతట వ్యాప్తం
బై తనరు టెఱుఁగు నరుఁ డెప్పు
డాతఁడు బ్రహ్మంబుఁ జెందు నప్పుడ పార్థా. 30

తే॥ గీ॥ తా ననాదియు నిర్గుణుం డై నకతన
నవ్యయుం డైన యీపరమాత్ముఁ డౌర
కాయమందున్న వాఁడయ్యుఁ జేయఁ డెద్ది
చెందఁ డంటఁడు ముట్టఁ డమందవీర్య. 31

కం॥ అన్నింటఁ జొచ్చి సుడిసియు
నెన్నం డాకాశ మంట దెట్లట్లు నరా

యన్నివపువులం దుండియు
నన్నా పరమాత్ముఁ డెద్ది యుంటఁడు సుమ్వే. 32

కం॥ రవియొక్కఁడ యీసకలం
బవులోకము వెలుఁగఁజేయు నర్జున యెట్ల
ట్లవురా క్షేత్రియు సకలం
బవుక్షేత్రంబులను వెలుఁగునట్టుల చేయున్. 33

కం॥ నలి నిటు క్షేత్రిక్షేత్రం
బులవాసియు మాయనుండి భూతములెల్లం
దొలఁగుటయు జ్ఞానదృష్టిని
దెలిసినఁ బరమేశ్వరుని దుదిం జెందనగున్. 34

గద్య.

ఇది శ్రీ త్రికవిమిత్ర తాడూరి రామనభట్టాగ్రపుత్ర పండితారాధన మండిత లక్ష్మీనరసింహా పండిత ప్రణీతంబైన యుపనిషత్తును బ్రహ్మవిద్యయును యోగశాస్త్రంబును శ్రీకృష్ణార్జున సంవాదంబును నగు భగవద్గీతయందు క్షేత్ర క్షేత్రజ్ఞవిభాగయోగమను పదుమూఁడవ యధ్యాయము.





# ఆంధ్రభగవద్గీత.

## పదునాలుగవయధ్యాయము.

# గుణత్రయ విభాగయోగము.

---

వ॥ శ్రీ భగవంతుండు మఱియు నిట్లనియె.

కం॥ మఱియును జ్ఞానంబులలో
నెఱిఁగించెదఁ బరము శ్రేష్ఠ మెయ్యది మున్నం
దఱుమునులు దానిఁ [illegible]ర్థా
యెఱిఁగికదా మోక్షమంది రిందుండి తగన్. 1

కం॥ ధరలో నీజ్ఞానంబును
పరి యుపలంబించి నాదు సాధర్మ్య మ్మొ
ప్పారు గందురి సృష్టితఱిఁ బు
ట్టరు ప్రళయంబందుఁ బొడవడంగరు వారల్. 2

కం॥ తా నల్లప్రకృతి నాకున్
యోనియగున్ నేను గర్భ ముని చెద నందున్
బానం భూతములెల్లను
మానుగ నోపాండుపుత్ర!మధ్యమ పుట్టున్. 3

ఆ॥ వె॥ ఎల్ల యోనులందు నే యే శరీరముల్
పుట్టుచుండు జగతి నట్టివాని
కరయఁ బ్రకృతి యోనియై యొప్పు నందు వి
త్తనము నాటు నట్టితండ్రి నేన. 4

తే॥ గీ॥ ధరణి సత్వము రజము ను దమము ననఁగఁ
బొనరు గుణములు ప్రకృతిచేఁ బుట్టినట్టి
వయ్యె నీమూఁడు నవ్యయుం డైనయట్టి
దేహి నరికట్టుచుండును దేహమందు. 5

తే॥ గీ॥ అందు సత్వంబు నిర్మలం బౌటఁజేసి
వెలుఁగొసఁగు చామయుంబులఁ దలఁగుచును సు
ఖాభిమానంబు మఱియు జ్ఞానాభిమాన
మనెడునీరెంటితో దేహి నంటఁగట్టు.

కం॥ నలి రాగపూరా పొచును
నిలలోన రజోగుణంబు తృష్ణాసంగం
బులఁ బుట్టించుచుఁ గర్మం
బులతగులున కతని లంకె పొనరఁగ వైచున్. 7

కం॥ తమ మజ్ఞానమునకు జన
కమయి శరీరులకు మోహకర్మై యాల
స్యముతోడ వారినిఁ బ్రమా
దముతోడను నిద్రతోడఁ దగ బంధించున్. 8

కం॥ సుకమందు సత్వము రజ
స్సు కర్మములయందుఁ దమము సుజ్ఞానముఁగ
ప్పికరము ప్రమాదమందున
సకలశరీరులను సవ్యసాచీ నడపున్. 9

కం॥ ఒక్కొకతఱి నీమూఁటను
నొక్కొక్కటి తక్కురెంటి నొయ్యనడఁగఁ గాఁ
ద్రొక్కుచుఁ బ్రబలంబై కడు

నిక్కను గురువంశవార్ధి నీరజవైరీ. 10

కం॥ ఎప్పుడు వెలుఁగిడుజ్ఞానము
తప్పక యీమేన నెల్లద్వారంబులలో
నొప్పుగఁ బుట్టును సత్త్వం
బప్పుడ యెఱుఁగునది ప్రబలమైన దటంచున్. 11

తే॥ గీ॥ సర్వసామాన్యచేష్ట లిచ్ఛలు దురాశ
శమములేమియు స్వప్రయోజనపుఁ గర్మ
మాచరించుట యనునివి యర్జునా ర
జస్సు ప్రబలంబగును వడి సంభవించు. 12

కం॥ పొరపా టేమఱపాటును
ధరణిఁ బ్రకాశంబు లేమి స్తబ్ధత్వంబుం
గురునందన పుట్టునుజూ
మ్మరయంగఁ దమస్సు ప్రబలమగుటయు మఱియున్. 13

కం॥ ఏదశ సత్త్వము ప్రబలం
బాదశఁ దా నొకటిమైన నర్జున పొందుం
జూ దేహి నిర్మలంబగు
వేదవిదులలోకముల వివేకాభ్యర్థీ. 14

కం॥ హెచ్చురజస్సునఁ గా వి
వ్వచ్చుఁడ కర్మపరులందుఁ బరఁగఁగఁ బుట్టున్
హెచ్చుతమస్సునఁ గాఁ దా
నచ్చుగ నిలమూఢయోనులందునఁ బుట్టున్. 15

కం॥ ఇల సాత్త్వికములకున్ ని
ర్మలసత్కర్మములఫలము రాజసములకున్

ఫలము సంసారదుఃఖము
ఫల మజ్ఞానంబు తమువలనిపనులకున్. 16

కం॥ కలుగును జ్ఞానము సత్వము
వలనను లోభము రజస్సునలనను భార్థా
కలుగును గలుగుఁ దమస్సున
నిల నజ్ఞానంబు మోహ మేమఱపాటున్. 17

కం॥ చనుఁ బైకి సాత్వికుఁడు న
డ్మిన నిల్చును రాజసుం డమితగుణ కురునం
దన యలఁతిగుణముతిప్పలఁ
జనుఁదామసుఁ డైనవాఁడు సను నడుగునకున్. 18

కం॥ గుణముల కంటెను వేఱది
గణియింపఁగ నెపుడుఁ గర్త కాదని కనుచుం
గుణముల కతీతు నెఱుఁగును
గుణనిధి నాభావ మపుడు కోవిదుఁ డందున్. 19

కం॥ తగ నీదేహసముద్భవ
మగుమూఁడుగుణముల దాఁటినట్టిఁడు తాఁ బు
ట్టుగుఁ జావు జరయు దుఃఖము
దిగవిడిచి వెసంబడయుఁగదే మోక్షంబున్.

వ॥ ఇట్లు భగవంతుండు బోధించిన విని యర్జునుండు.

కం॥ ఈమూఁడుగుణము లడఁచిన
యామానిసిచిన్నె లేమి యాతఁడు దేవా
యేమాచరించుచుండును
నీమూఁడుగుణంబు లాతఁ డెట్టులుదాఁటున్. 21

వ॥ అనియడుగుటయు శ్రీభగవంతుం డిట్లనియె.

కం॥ అమర నెవఁడు సాత్విక కా
ర్యము వచ్చిన వచ్చెనేని రాజసమగు కా
ర్యము వచ్చినఁ దామసకా
ర్య మేవగింపఁ డవి పోవ నాశింపఁడు సూ. 22

కం॥ అనిశము మధ్యస్థుని బో
లెను నిలిచి గుణములచేఁ జలింపక ధర నె
ల్లను గౌణవ్యాపారము
లని యెఱిఁగి యెవండు బెగడు నందక యుండున్. 23

చం॥ కని తన కష్టకష్టము సుఖంబును నొక్కటి కాఁగ స్వస్థుఁడై
కనుచును మంటిగడ్డ బొమగల్లును బంగరు నొక్కరీతిగాఁ
గను బ్రియ మప్రియంబు సరిఁ గాంచుచు నెవ్వఁడు ధీరుఁడై యొరుల్
తనుఁ బొగడంగఁ దుల్కఁ డిలఁ దన్నును దిట్టిన నల్గఁ డింతయున్

కం॥ ఇదిమానం బవమానం
బిది మిత్రుఁడు వీఁడు శత్రుఁ డితఁడన కెవ్వం
డిడ సర్వారంభంబులు
వదులు గుణాతీతుఁ డండ్రు వానిం బార్థా. 25

ఉత్సాహ॥ ఒనర నిశ్చలంపుభక్తి యోగమున నెవండున
న్ననఘ కొల్చుచుండువాఁడు నట్టివాఁడు చెచ్చెఱన్
దనర నీగుణత్రయంబు దాఁటి బ్రహ్మభూయముం
గనఁగ నిక్కమమ్మ గాఁగఁ గవ్వడీ సమర్థుఁడౌ. 26

తే॥ గీ॥ బ్రహ్మ కాశ్రయమైనట్టివాఁడ నేన
యవ్యయంబైన మోక్షాశ్రయంబు నేన

అమరశాశ్వతధర్మాశ్రయంబు నేన
అన్నయేకాంతసౌఖ్యాశ్రయంబు నేన. 27

గద్యము

ఇది శ్రీ త్రికవిమిత్ర తాడూరి రామనభట్టాగ్రపుత్ర పండితారాధన మండిత లక్ష్మీనరసింహ పండితప్రణీతంబైన యుపనిషత్తును బ్రహ్మవిద్యయును శ్రీకృష్ణార్జునసంవాదంబును నగు శ్రీ భగవద్గీతయందు గుణత్రయవిభాగయోగమను చతుర్దశాధ్యాయము.





భగవద్గీత

పదునేనవయధ్యాయము.

# పురుషోత్తమప్రాప్తియోగము.

---

మ॥ నలి మీఁదం గల వెల్ల మూలములు క్రిందం గల్గునీయెల్లఁ గొ
మ్మలు నై తద్దయు వీఁగునిల్లనెడుభీమంబైనయశ్వత్థముం
దిలకింపంగ ననాది యంచు రిటఁ గుంతీపుత్ర యద్దాని కాఁ
కులు వేదంబులు దాని నేనరుఁ డెఱుంగు న్వాఁడె వేదజ్ఞుఁడౌ.

చం॥ అరయ గుణప్రవృద్ధ మయి యూరవురా విషయప్రవాళమై
పరఁగుచుఁ గ్రిందుమీఁదు తగఁ బ్రాకుచునుండునుదానికొమ్మలో
నర నరలోకమందునఁ జనంగను గర్మగణానుబంధమై
చొరఁబడుచుండుఁ గ్రిందికిని జువ్వె తదీయము లైనవేళ్ళునున్. 2

ఉత్సాహవృత్తము

దీనిరూప మట్టు లిందుఁ దెలియ రాదు చూడఁగం
దీనిమొదలు దీనితుదియు దీనిపాఁ తెఱుంగరా
దోసృవృషభ వేళ్ళ పాఱి యుర్వరం గడుం దృఢం
బైనయీంతరువు విరక్తియన్దృఢాసి నఱకుచున్. 3

ఉత్సాహవృత్తము.

దేనిఁ బొంది సిదప నిందుఁ దిరిగి రారుమానవుల్
మానుగాను వెదకి కొన వలయును దత్పదంబు వే
యేనివలన నాదిలేని యీప్రవృత్తి వ్యాప్త మ
వ్వాని నాదిపురుషుఁజొచ్చువాఁడశరణమంచునున్. 4

ఉత్సాహవృత్తము.

మాన మోహములను విడిచి మఱి జయించి తగులముల్
జ్ఞానవిద్యఁ బడయఁ గోరి చక్కడంచి కామముల్
స్థాన మీక కష్టసౌఖ్యసంజ్ఞ లైనరెండ్లకుం
జ్ఞాని యల్ల చెడనిపదవిఁ జక్కఁ బొందువాఁడు సూ. 5

ఉత్సాహవృత్తము

ఎల్లవాఁడు దేనిఁ బొంది యిందు రాక వెల్గు వాఁ
డల్లపదము సూర్యుఁ డైన నల్ల చంద్రుఁ డైనఁ దా
నల్లయగ్నిహోత్రుఁ డైన నకట వెల్గఁ జేయలేఁ
డల్లపరమ మౌచు నొప్పు నట్టిపదము నాది సూ. 6

ఆ॥ వె॥ నలి ననాది యైన నాయంశ మే సుమ్మి
జీవలోకమందుఁ జెలఁగు జీవుఁ
డతఁడు ప్రకృతినుండి యైదింద్రియములు మ
నమ్ము సంగ్రహించు నెమ్మిఁ బార్థ. 7

తే॥ గీ॥ సొరిది నాయాయుమేనులు సొచ్చునప్పుడు
విడుచునప్పుడు నయ్యీశ్వరుఁడు కిరీటి
వానిఁ గొనిపోవు వాసనాస్పదమునుండి
పొసర వాయువు తావిఁ గొంపోవునట్లు. 8

ఆ॥ వె॥ కనులు ముక్కు చెవులు తనువు నాల్కనునింద్రి
యంబులందు మనసునందు నిలిచి
వేడ్క రూపముఖ్యవిషయంబు లెల్ల నా
తఁడు గుడుచుచుండఁ బాండుపుత్ర. 9

ఉ॥ అనఘు యుతండు పోవునపు డైనను మేనను నిల్చునప్పుడై
నను దగఁ గుడ్చునప్పుడయినన్ విజయా గుణసంఘయుక్తుఁడై
ననుఁ గనఁ జాల రించుక మనంబున మూఢులు జ్ఞాననేత్రులై
చనియెడువారు తాము కనఁ జాలుదు రాతని నెల్లభంగులన్. 10

కం॥ తనలోన జీవుఁ డున్నాఁ
డని యోగియు నెఱుఁగఁగలఁడు యత్నాచరణం
బున నకృతాత్ముఁ డచేతసుఁ
డనఘా కనలేఁడు వాని యత్నించినను. 11

కం॥ భువనముల వెలుఁగఁ జేయుచు
సవితృనిలో నున్న వెలుఁగు చంద్రుని వెలుఁగ
గ్ని వెలుఁగు చూడ మదీయ మ
గు వెలుంగే యెఱుఁగ వయ్య కుంతీపుత్రా. 12

తే॥ గీ॥ భూమిదేవి నావేశించి భూతసమితి
నొనర నాబలమున మోయుచున్నవాఁడ
మఱియు రసరూపుఁ డౌ చందమామ నగుచు
నోషధుల నెల్లఁ బోషింపుచున్నవాఁడ. 13

తే॥ గీ॥ అమర జఠరాగ్ని నై ప్రాణి దైనయట్టి
మేనిలోఁ జొచ్చి ప్రాణ మపాన మనెడు
వాయువులతోడఁ గూడినవాఁడ నగుచు
నన్న మఱిగింతు నలుఁ దెఱఁగైనదాని. 14

చం॥ అనిశము నెల్లవారిహృదయంబున నిల్చెద నేను నాకతం
బున నలజ్ఞానమున్ స్మృతి యుపోహయుఁ బుట్టుచు వేదవేద్యుఁడై

యనిశము నొప్పువాఁడ నిగమాంతకరుం డగువాఁడ నేన క
ల్గి నెఱిని సర్వవేదము లెఱిఁగినవాఁడను నేన వింటివే. 15

కం॥ క్షరుఁడు ను నక్షరుఁడను నీ
యిరుదెఱఁగులవారు పురుషు లెల్లెడఁగలరా
క్షరుఁ డెల్లభూతములు న
క్షరుఁ డాకూటస్థుఁ డంద్రు జగతిం బార్థా. 16

కం॥ అరయఁగ నేఱొకపురుషుఁ డు
పరముం డున్నాఁడు వాఁడె పరమాత్ముఁ డన
శ్వరుఁ డగునారాయణుఁ డతఁ
డిరవుగ ముజ్జగముఁ జొచ్చి యెల్ల భరించున్. 17

కం॥ క్షరపురుషాతీతుఁడ న
క్షరుకంటెను నుత్తముండఁ గావున నన్నె
ల్లరు గావ్యంబులు శ్రుతులును
బురుషోత్తముఁ డనఁ బ్రసిద్ధిఁ బొందినవాఁడన్. 18

కం॥ పురుషోత్తముండ నన్నే
వర మోహము విడిచి యిట్లు నలి నెఱిఁగెడు న
ప్పురుషుఁడు సర్వజ్ఞుం డై
పరఁగ నను భజించు సర్వభావముచేతన్. 19

కం॥ ఇది పరమగుహ్యశాస్త్రం
బిది నీ కెఱిఁగించినాఁడ నీరీతి నెవఁ
డిది నెలకొలుపును దన దగు
మదిఁ గృతకృత్యుండు బుద్ధిమంతుఁ డతం డౌ. 20

గద్య.

ఇది శ్రీ త్రికవిమిత్ర తాడూరి రామనభట్టారక కాగ్రపుత్ర
పండితారాధనమండిత లక్ష్మీనరసింహ పండిత ప్రణీతం
బైన యుపనిషత్తును బ్రహ్మవిద్యయును యోగ
శాస్త్రంబును శ్రీ కృష్ణార్జున సంవాదం
బునగు శ్రీ భగవద్గీతయందుఁ
బురుషోత్తమ ప్రాప్తి
యోగమను పం
చదశాధ్యా
యము.





ఆంధ్రభగవద్గీత.

పదియాఱవయధ్యాయము.

# దైవాసురసంపద్విభాగయోగము.

---

క॥ భువి వెఱపులేమి యును జి
త్తవిశుద్ధియు జ్ఞానయోగధారణ మనన
య్యావియును నీగియు దమమా
ర్జవమును జన్నంబు దపము స్వాధ్యాయముబున్. 1

క॥ అమర నహింస యు నక్రో
ధము సత్యము శాంతి భూతదయ త్యాగము కొం
డెములాడమి యువ్విళ్ళూ
రమి సిగ్గు నచాపలము నరా మార్దవమున్. 2

క॥ క్షమయు ను దేజంబు ను ధై
ర్యము గర్వములేమి శౌచ మద్రోహంబున్
సమకూరుచుండు దేవాం
శమునం జన్మించినట్టిజనునకుం బార్థా. 3

క॥ సమకూరును దర్పము దం
భము నజ్ఞానంబు దురభిమానంబును గ్రో
ధము పారుష్యం బసురాం
శమునం జన్మించినట్టి జనునకుం బార్థా. 4

క॥ చన దేవాంశమ్మున వ
చ్చును మోక్షం బాసురమునం జొప్పడు భవబం

ధన విూ వలదేవాంశం
బునఁ బుట్టినవాఁడ వౌదు పౌగులకు మింకన్. 5

కం॥ ఇల్ల దైవంబులు నాసుర
ములు నని భూతములజన్మములు రెండుతెఱం
గులు విస్తరించి దైవముఁ
దెలిపితి నిఁక నాసురంబుఁ దెలిపెద వినుమా. 6

కం॥ లేదుప్రవృత్తి నివృత్తి యు
లే దాచారం బొకింత లేదు శుచితయున్
లే దర్జున సత్యంబును
లే దసురాంశంబున న్నిలిచెడు జనులకున్. 7

చం॥ చనుజగ మెల్ల నాసురులు సత్యముకాదు ప్రతిష్ఠితంబు కా
దనువగఁపాలకుం డయినయాతఁడు దానికి లేఁడు చూడఁగా
ననిశపరస్పరప్రభవ మయ్యది కాదు మఱేమి యందురేఁ
గన నది కామహేతుకము కాక మఱేమియుఁ గాదటంచు ప్రసూ.

ఆ॥ వె॥ ఇట్టిమతము నూని యింద నష్టాత్ములై
యల్పబుద్ధి గలిగి యకట క్రూర
కర్మ లగుచు లోకకంటకులై వారు
జగముచేటుకొఱక యగుదు రరయ. 9

ఆ॥ వె॥ అందరానట్టి కోరిక లావహిల్లి
దంభము ను గర్వపటిమ మదంబు హెచ్చి
మోహమున దుష్పరిగ్రహములు గ్రహించి
వా రశుచులౌచు వర్తించువారు ధరణి. 10

కం॥ చచ్చినదాఁకను మితితే
కెచ్చిన్నెరేడుచింత మునిఁగి యిట భోగములన్
విచ్చలవిడిఁ గుడుచుటయే
యచ్చుగ మెచ్చుపురుషార్థ మని నమ్మి యెదన్. 11

గీ॥ అకట నూఱులకొలఁది యానాసత్త్రాళ్ళఁ
గట్టఁబడి క్రోధకామముల్ కరము తాల్చి
కామభోగార్థ మర్థసంగ్రహము తప్పు
దారి నడచుచుఁ జేసెదు వారువారు. 12

కం॥ ఇది సమకూరెను నా కిపు
డిదె యీకోర్కె యిఁక నాకు నీడేఱు నూ ఱ
మ్మిదె నాకుఁ గలధనము తా
నిదె కాఁ గల దింక నాకు నిర్ధనమెల్లన్. 13

మత్తకోకిల

వీనిఁగూల్చితి వానిఁగూల్చితి వీఁకతో నవలీలగా
నేను గూల్పఁగలాఁడ నింకను నిల్చియున్న విరోధులన్
నేన నన్నెవఁడేమిసేయును నేనె ప్రభుఁడను భోగినిన్
నేనె నేనె కృతార్థుఁడై తిని నే సుఖాబ్ధి బలీయుఁడన్. 14

కం॥ కలవాఁడను నేనే స
త్కులపరిసూనుండ నొండొకొఁడు నాకీ డే
సలిపెదఁ గ్రతురాజములం
బులిసెద నంచు నవివేకమోహితు లగుచున్. 15

ఉత్సాహవృత్తము

పలుఁదెఱఁగు చిత్తములను బలుఁదెఱఁగు లై సభ్రాం

తులను బొంది మోహ మనెడు దొడ్డవలను జిక్కుచుం
బులుపు మీఱఁ గామభోగములను దగులు వడుచు న
మ్మలిన నరకమునఁ బడుదురు మధ్యమం ద యర్జునా. 16

ఉత్సాహావృత్తము

అనఘ తమ్ముఁ బొగడికొనుచు నకట యుఱక పెద్దలం
ధనమువలనిమానమున మదమున విఱ్ఱవీఁగుచుం
దనిసి విధివిరుద్ధముగను దంభ మూని మఱి యు నా
జనులు పేరికొఱకుమాత్రి నలుపు చుంద్రు జన్నముల్. 17

కం॥ బలదర్పాహంకారం
బులు గామము గ్రోధ మెడఁద మువ్పిఱిగొన వా
రలు తమ కితరులకును మే
నులఁ గల నన్నుఱ కసూయ నొంపుదు రొరులన్. 18

ఉత్సాహ

ఆరయంగఁ జెడ్డవాండ్రు నకట మిగులఁ దుచ్ఛగా
వారుఁ గ్రూరులైన యట్టివాండ్రు నోచు నున్నయా
వె రిజనుల నెల్ల నేను బాఱవేతుఁ జుమ్మి సం
సారమందు రాక్షసాంశజన్మ మిచ్చి నిచ్చలున్. 19

గీ॥ అట్టు లసురాంశసంభవు లగుచు మూఢు
లరయఁగా నన్నుఁ జెంద లే కక్కటకట
సవ్యసాచి పదంపడి జన్మజన్మ
మును నధోగతి పాలయి పోవునారు. 20

కం॥ వినుమా కామము గ్రోధం
బును లోభం బనెడుమూఁట ముత్తెఱఁగై తా

చనునది యాత్మఁ జెఱపి చే
ర్చు నరక మీమూఁడును విడుచునది కిరీటీ. 21

కం॥ నర మూఁడై యుండెషునీ
నరకద్వారములు విడుచునరుఁ డగు శ్రీయ
స్కరుఁ డాత్మకు సద్గానం
బరమగతి న్వడయువాఁడు భాసురభంగిన్. 22

కం॥ విచ్చుఁడ నడచును దా
నెవ్వఁడు శాస్త్రవిధి విడిచి యిచ్ఛాగతి తో
నవ్వాఁడు సిద్ధి బొందం
డవ్వానికి లేదు సుఖము నలమోక్షంబున్. 23

ఉత్సాహ

అదికతమున నీకు శాస్త్ర మరయఁగాఁ బ్రమాణ మా
నెదియకార్య మెద్ది కార్య మిందు నొచునుండు న
య్యది యెఱుఁగ నల్లశాస్త్రమందుఁ జెప్పినట్లుగా
విదితవీర్య కర్మమీవు వేగమిందు సల్పుమా. 24

గద్యము.

ఇది శ్రీ త్రికవిమిత్ర తాడూరి రామనభట్టాగ్రపుత్రి పండితారాధన
మండిత లక్ష్మీనరసింహ పండిత ప్రణీతంబైన యుపనిషత్తును
బ్రహ్మవిద్యయును యోగశాస్త్రంబును శ్రీ కృష్ణార్జు
న సంవాదంబును నగు శ్రీ భగవద్గీతయందు
దైవాసుర సంపద్విభాగయోగమును
పదియాఱవ యధ్యాయము.

భగవద్గీత.

పదియేడవ యధ్యాయము.

# శ్రద్ధాత్రయవిభాగయోగము.

తే॥ గీ॥ పృథ్వి శాస్త్రవిధుల్ విడిచి వృద్ధసాంప్ర
దాయమున భక్తిఁ బూజలుసేయునట్టి
వారినిలుకడ యెట్టిది వాసుదేవ
సాత్వికమొ రాజసమొ తామసమ్మొ చెపుమ. 1

వ॥ అనియడుగుటయు శ్రీభగవంతుండిట్లనియె.

కం॥ చనఁ బ్రాణులకు స్వభావ
మ్మునఁ బుట్టినయట్టి శ్రద్ధ ముత్తెఱఁగై యొ
ప్పును సాత్వికి యని రాజసి
యని తామసి యని యు వాని నన్నింటి వినుమా. 2

కం॥ నర యెల్లవాఁడు నంతః
కరణమునకుఁ దగినశ్రద్ధ గలఁడిలలో నీ
పురుషుఁడు శ్రద్ధామయుఁ డె
వ్వ రెట్టిశ్రద్ధగలవారు వారలు వారే. 3

తే॥ గీ॥ సాత్వికులు దేవగణముల సవ్యసాచి
రాజసులు యక్షగణముల రాక్షసులను
తామసులు ప్రేతగణము భూతగణములను
బూజసేయుచు నున్నారు పురుషవర్య. 4

క॥ ఇల దంభాహంకార
మ్ముల పీఁగుచుఁ గామరాగముల దైన మహా
బలకారణమున నవివే
కులై మెయిం గలుగు భూతకోటిని మఱియున్. 5

క॥ లోమెయిఁ గల నన్నును నఱి
కేమానవు లిల నశాస్త్రహితమును నశుభం
బౌమాడ్కిఁ దపముసేయుదు
రామానవు లెల్ల వినుమ యాసురవృత్తుల్. 6

తే॥ గీ॥ ఎల్లవారి ప్రియాహార మిందు మూఁడుఁ
దెఱఁగులై యొప్పుచుండు సత్తెఱఁగు గాఁగ
యజ్ఞము దపస్సు దానంబు నగుఁ ద్రివిధము
విస్తరించెద నవ్వాని భేద మిదియె. 7

మ॥ విమలజ్ఞానము నాయువుం బలమునుం బ్రీతి న్మహారోగ్యసౌ
ఖ్యములుం బెంపఁగఁ జాలియున్నయవియై యత్యంతరస్యంబులై
చమురుం గ్లినయట్టివై స్థిరములై స్వాదైన యాహారముల్
సమరాభీల ప్రియంబు లౌను ధరలో సత్వస్థు లౌవారికిన్. 8

మ॥ కడుఁ జేఁదై కడు వేఁడియై మఱి కడుం గారంబులై పుల్సనై
కడు నుప్పై కడు మంటపెట్టునవియై కౌంతేయ తిన్నంతనే
కడు నోరార్చెడునట్టివౌచు రుజయుం గష్టంబు శోకంబు దా
మిడునాహారము లెల్ల రాజసుల కెంతే నిష్టముల్ చూడఁగన్. 9

ఉత్సాహవృత్తము.

అనఘ జాము దాఁటినదియు నాఱిపోయినదియు వా
సన జనించినదియు మిగులఁ జల్లనాఱినది యొకట్

తినఁగ మిగిలినదియు శుద్ధి లేనియదియు నైనభో
జనము సూ తమోగుణమునఁ జనెడువారి కిష్టమగా. 10

కం॥ చన యజ్ఞము చేయుటయే
పని యని మది నిశ్చయించి ఫలమాసింపం
జన కిల శాస్త్రోక్తముగాఁ
గను యజ్ఞము చేయ సాత్త్విక మ్మది పార్థా. 11

కం॥ ఫలములఁ గోరుచు దంభం
బులకొఱ కెవఁడేని యజ్ఞముం ధరలోనన్
సలుపును భారత బాలా
యలయజ్ఞము రాజసంపుయజ్ఞము సుమ్మా. 12

తే॥ గీ॥ అరయ శాస్త్రవిరుద్ధంబు నన్నదాన
రహితమును మంత్రహీనంబు విహితమైన
దక్షిణలు లేనిదియును శ్రద్ధయును లేని
దైనయజ్ఞంబు తామసయజ్ఞమగును. 13

తే॥ గీ॥ దేవపూజయు గురుపూజ ద్విజులపూజ
ప్రాజ్ఞపూజయు శౌచ మార్జవము పరుల
బాధ పెట్టమి పరభామపయిన భోగ్య
కామతియు లేమి శారీరతపమటండ్రు. 14

కం॥ ఎదిరికిఁ బ్రియమై హితమై
మదినొంపక సత్యమైనమాట యు దేదో
యదియును స్వాధ్యాయంబను
నదియును వాఙ్మయతపం బటందురు పార్థా. 15

ఆ॥ వె॥ మానసునిర్మలతయు మౌనంబు సుముఖత్వ
మల్లయాత్మనిగ్రహంబు మఱియుఁ

బొందవేయ వినుమ భావసంశుద్ధియు
మానసికతపస్సు మహి నటండ్రు. 16

కం॥ చలియింపనిచిత్తంబుల
ఫలకాంక్షలు లేని వారు పరమశ్రద్ధన్
సలిపెడు మూఁడువిధము లౌ
నలతపమును సాత్వికం బటందురు జగతిన్. 17

కం॥ తన సత్కారము మానం
బును బూజయు బ్రతిఫలముగఁ బొందఁగ దంభం
బునఁ జేయు చలము నధ్రువ
ము నగుతపము రాజసంబు పూరుషవర్యా. 18

కం॥ వెడనిశ్చయంబుచేఁ దన
యొడలిం బాధించి యైన నొరులంబార్థా
కడుఁ జెఱుపనైనను జే
సెడుతపముం దామస మని చెప్పుదు రనఘా. 19

కం॥ తన కీఁదగు నని ప్రతిఫల
మును గోరక దేశకాలములఁ బాత్రములం
గని యిచ్చెడు నద్దానము
ఘనబాహూ పరమసాత్వికం బనఁ బరఁగున్. 20

కం॥ ఆరయ ఫలమేఁ బ్రత్యుప
కారంబేఁ గోరి మిగులఁ గష్టముతో నె
వ్వారలు దానం బిత్తురు
వారిది రాజస మటండ్రు భారతబాలా. 21

కం॥ వలి దేశకాలపాత్రం
బులఁ జూడక యిచ్చుదానమును సత్కారం
బులు లేక నవమానము గల
యుల దానము తామసం బటందురు పెద్దల్. 22

కం॥ చన నోం తత్సత్తనుచు
న్వీను మూఁడువిధములు బ్రహ్మనిర్దేశం బ
య్యేను దానివలనఁ బార్థా
మును బ్రాహ్మణ దేవయజ్ఞములు జనియించెన్. 23

తే॥ గీ॥ ఆకతంబున విధ్యుక్తమైన యట్టి
యజ్ఞ దాన తపఃక్రియ లాచరించు
నపుడు ముందుగ నోంకార మాచరింతు
బ్రహ్మవాదులు నిచ్చలు పాండవేయ. 24

కం॥ ఫల మాసింపక వివిధం
బులైనతపములును యజ్ఞములు దానంబుల్
సలుపుతఱి ముముక్షువులు మొ
దల శ్రద్ధను నుచ్చరింతు తచ్ఛబ్దంబున్. 25

కం॥ కల దనునర్థంబున మి
క్కిలి మే లనునర్థమందుఁ గ్రిడి ప్రయోగం
బుల సత్తు కానఁబడు నది
వలి శుభకార్యములయందునను వాడఁబడున్. 26

తే॥ గీ॥ యజ్ఞదానతపంబులయందు నిష్ఠ
సత్తు నాఁబడు ధరణిలో సవ్యసాచి
మఱియు ను దదర్థమైనకర్మములు నల్ల
సత నెడు పేరిచేత నే జరగుచుండు. 27

ఆ॥ వే॥ ఒనరశ్రీద్ధ లేని హోమ మైనను దపం
బైనదాన మైన నన్యమైన
యెట్టికర్మమైన నెన్నంగఁ బడు నస
త్తనుచుఁ గాద యది యిహపరములకు.  28

గద్యము.

ఇది శ్రీ త్రికవిమిత్రీ. తాడూరి రామనభట్టాగ్రపుత్ర పండితారాధ
న మండిత లక్ష్మీనరసింహ పండిత ప్రణీతంబయిన యుప
నిషత్తును బ్రహ్మవిద్యయును శ్రీకృష్ణార్జున సం
వాదంబును నగు శ్రీ భగవద్గీతయందు
శ్రద్ధాత్రయ విభాగయోగంబను.
సప్తదశాధ్యాయము.



భగవద్గీత.

పదునెనిమిదవ, యధ్యాయము.

# మోక్షసన్న్యాసయోగము.

శ్రీ భగవంతుండిట్లు చెప్పుటయు మరల నర్జునుండు.

తే॥ గీ॥ త్యాగసన్న్యాసములు రెంటి తత్త్వములకుఁ
దారతమ్యంబెఱుంగఁగాఁ గోరువాఁడఁ
గేశిసూదన యోహృషీకేశ యోమ
హాభుజా వేఱువేఱుగా నానతిమ్ము. 1

వ॥ అనియడుగుటయు శ్రీభగవంతుఁడిట్లు బోధింపఁదొడంగె.

తే॥ గీ॥ కామ్య మయినంతవట్టును గర్మసమితి
నరసి విడుచుట సన్న్యాస మనియు మఱియు
జగతిఁగర్మఫలంబులసమితి విడువు
త్యాగ మంచును గవివరు లందు్రి పార్థ. 2

తే॥ గీ॥ దోషవత్కర్మములను గొంద ఱొఱు మనీషు
లైనవారలు త్యక్తవ్య మందు్రి, మఱియు
యజ్ఞమును దానమును దపం బనెడుకర్మ
ములను గొందఱు విడువంగ వలవ దందు్రి. 3

తే॥ గీ॥ అనఘ భారతశ్రేష్ఠ యీయర్థమందు
నేను జెప్పెద నీకు నా నిశ్చయమ్ము
మొదలఁ దెలియంగఁ ద్యాగంబు మూఁడుఁ దెఱఁగు
లంచునీకును జెప్పినయదియ కాదె. 4

తే॥ గీ॥ యజ్ఞమును దానమును దపం బవని విడువ
వలవ దవ్వానిఁ జేయనే వలయుఁ జావ్వె
యజ్ఞమును దానమును దపం బరయఁగా మ
నీషులను బావనులఁ జేయు నిత్యధీర. 5

కం॥ ఈకర్మంబులు ధరఁ బా
ర్థా కరణీయంబు లైన నలసంగఫలా
నేకములు విడిచి చేయుట
యే కర్జము నాదుమేలయినమత మిది సూ. 6

తే॥ గీ॥ నియతకర్మ మెడపు నీతి గా దది మోహ
కారణమ్మువలనఁ గలిగె నేని
దానిఁ దామసంపుఁద్యాగం బటందురు
పెద్ద లైనవారు పృథ్విలోన. 7

కం॥ తనయొడ లలయు ననెడుభయ
మునఁ గడుఁ గష్ట మని కర్మము విడుచు నెవఁ డా
తనిత్యాగము రాజస మా
తనికిన్ మోక్షంబు లేదు తత్త్యాగమునన్. 8

కం॥ విడిచి ఫలము మమకారము
గడఁగి నియతకర్మమెల్లఁ గావ్యం బని చే
సెడుదాన నైనత్యాగము
పుడమిన్ సాత్వికపుఁద్యాగము సుమీ యరయన్. 9

మ॥ ధరలో సత్వగుణ ప్రధానుఁ డయి తత్వజ్ఞానమం దెంతయున్
స్థిరధీ గల్గి సమస్తసంశయములన్ జిత్తంబున స్వీడి యో
నరుఁడా త్యాగము సేయు నెవ్వఁ డతఁడైనం దోషవత్కర్మముల్
నిరసింపండును శోభనంబు లభిమానింపండునుం గూర్మిన్. 10

తే॥ గీ॥ దేహధారికి ధరణి నో బాహువీర్య
కర్మమెల్లను విడువ శక్యంబు కాదు
కాన గర్మఫలత్యాగి యైన యట్టి
వాడె త్యాగి యనంగనుఁ బరఁగు చుండు. 11

కం॥ తను వెడలుడు వత్యాగికి
ననిష్ట మిష్టంబు మిశ్రమను ముత్తెఱఁగై
చనుకర్మఫలము వచ్చున
అనఘా యెన్నండుఁ ద్యాగి కది రాదు సుమీ. 12

ఆ॥ వె॥ కవ్వడీ సమస్త కర్మసిద్ధ్యర్థమై
యైదుకారణమ్ము లమరు నంచుఁ
జెప్పఁ బడియె సాంఖ్యసిద్ధాంతమందవి
యివియె చెప్పువాఁడ నెలమి వినుము. 13

కం॥ ఇల మేనును గర్తయు న
వ్వల నయ్యయిందియములుఁ బలుతెఱఁగులుగా
వెలు గొందుచుండు చేష్టలు
నలదైవం బివియు నువ్వో యైదుకతంబుల్. 14

కం॥ మనమునఁ దనువున వాక్కున
మనుజుం డన్యాయమైన మఱిన్యాయంబై
నను గర్మ మొకటి మొదలిడ
ననఘా యీయైదు కతము లగు దాని కిలన్. 51

కం॥ ఈవిషయం బిట్లుండం
గా వత్సా కేవలాత్మ కర్త యనుచుం దా
నేవాఁ డను దుర్మతియై
యావాఁ డెఱుఁగఁ డకృతమతి యయిఁనకతమునన్. 16

కం॥ ఎవ్వాఁడు నేఁ గర్త ననం
డెవ్వానిదగుబుద్ధి యంటకింత పడదువాఁ
డివ్వసుధ వీరిఁ జంపియు
నెవ్వరిఁ జంపండ పొరయఁ డేదోషంబున్. 17

ఉత్సాహ

తెలివి తెలియఁదగినయదియుఁ దెలియువాఁ డటంచుఁ దాఁ
బొలుచుఁ గర్మచోదనంబు పుడమి మూఁడుఁదెఱఁగులం
గలది యయి కరణము కర్త కర్మమంచు ముత్తెఱం
గులను గర్మసంగ్రహమ్ము గూడఁ బొల్చు నర్జునా. 18

కం॥ జ్ఞానము కర్మముఁ గర్తయు
మానుగ గుణభేదములను మఱి ముత్తెఱఁగం
చో నర యనఁబడె గుణసం
ఖ్యానంబునఁ జక్క వినుమ యవియుఁ దెలిపెదన్. 19

తే॥ గీ॥ అమర వేర్వేఱు సర్వభూతములయందు
నక్షరావిభక్తైకభావేక్షణంబు
దేనిచేఁ గల్గుచుండును మానవునకు
నల్లజ్ఞానంబు సాత్త్విక మని యెఱుఁగుమ. 20

కం॥ నలి సర్వభూతములలో
పల నర వేర్వేఱ యున్కి భావము పలురూ
పులు బలుఁదెఱఁగులు గలదను
టిల రాజసమైనజ్ఞాన మిదియు నెఱుఁగుమా. 21

కం॥ ఒక్కటిఁ గని సర్వ మిదే
నిక్కం బని పాకులాడి నిక్క
మ్మక్కట హేతువు నెఱుఁగక

తక్కువ యగుజ్ఞాన మవనిఁ దామస మరయన్. 22

కం॥ ఇల నియతం బగుకర్మం
బులు మమకారంబు రాగమును ద్వేషంబున్
ఫలమాస లేక చేసిన
నలవానిని సాత్త్వికం బటందురు పార్థా. 23

కం॥ ఫల మాసించెడువాఁడే
నిల నన్నిఁటి కేన యనుచు నెవఁ డను వాఁడే
బలుఁ గష్టపడి యొనర్చెడు
నలకర్మము రాజసం బటందురు జగతిన్. 24

కం॥ వినుమొట్లు పోయి యెటు వ
చ్చునో యనక వ్యయంబుచేయుచును బహులకుహిం
సను జేయుచునుం దలకుఁ ద
గనిపని మోహమునఁ జేయఁ గాఁ దామస మౌ. 25

ఉ॥ అరయఁగ ముక్తసంగుఁ డయి యన్నిఁటి కే ననునట్టిభావముం
బోరయక తద్ధైర్య మెదఁ బొంపిరివోవఁగ నుత్సహించుచున్
నర తనదైనకార్య మయిన న్మతి కా దయిన న్వికారముల్
పొరయక కర్మముల్ సలుపు పూరుషు సాత్త్వికకర్త యం డ్రిలన్.

చం॥ కర మనురాగయుక్తుఁ డయి కర్మఫలంబు లపేక్షచేయుచున్
బరఁగుచు లోభియై పరుల బాధలుపెట్టఁగ నెప్డు సందు తా
నరయుచు శౌచము న్విడిచి హర్షము శోకము రా నెడంపలో
నిర విడి సేత సేయునరుఁ డెందును రాజసకర్త నాఁబడున్. 27

చం॥ తనదు మనంబు నిల్పఁగను దార్ఢ్యము లే కిలఁ బామరుండ యై
తన కొరు లెంత చెప్పినను స్తబ్ధత దాల్చుచు మాయకాఁడ యౌ
చు నొరుల మోసపుచ్చుచును సోమరిపోతయి దుఃఖశీలుఁ డై
ఘనభుజ దీర్ఘసూత్రి యగు కర్తను దామసుఁ డండ్రు కోవిదుల్.

క॥ మతియును బుద్ధియు ధృతియును
దెఱఁగులు మూఁడేసి యయ్యెఁ ద్రిగుణంబులచే
నెఱుఁగంగ వాని నెల్లను
గఱపెద వేర్వేఱ నీకుఁ గవ్వడి వినుమా. 29

క॥ ఇది కార్య మిదియకార్యం
బిది భయ మభయమిది మోక్ష మిది యిది బంధం
బిదియు నివృత్తి ప్రవృత్తియు
నిది యని యెఱుఁగు నలబుద్ధి యిల సాత్వికి యా. 30

క॥ ఇది ధర్మ మధర్మంబై
నదియిది యిదికార్యమైనయదియు నకార్యం
బిదియని నిజము తెలుపనే
రదేని తద్బుద్ధి పార్థ రాజసి సుమ్మా. 31

తే॥ గీ॥ అంధకారంబునం బడి యవనియంద
ధర్మమెల్ల ధనంజయా ధర్మ మనియు
నైనదెల్లను గానిది కానిదైన
దనియుఁ దలఁచును దామసి యైనబుద్ధి. 32

క॥ అమరంగ యోగమున నిలి
చి మనఃప్రాణేంద్రియముల చేష్టల నెల్లం
గ్రమముగ నియమించెడునరు
నమలధృతి న్సాత్వికి యని యందురు జగతిన్. 33

క॥ ఫలకాంక్ష గలిగి తగులం
బులఁ బడి ధర్మార్థకామముల నేపురుషుం
డలయక నడపెడువాఁ డగు

నిల వానిది రాజసంబుధృతి యగుఁ బార్థా. 34

కం॥ కడు దుర్బుద్ధి గలాఁడై
పుడమి నిదుర భయము శోకమును దిగులు మదం
బెడప కెవఁడు తాలిచి విడు
వఁడు తామసధైర్య మల్లవానిది పార్థా. 35

కం॥ మఱియును సుఖంబు సహితము
తెఱఁగులు మూఁడయ్యె వినుము దేన మరిగి తా
నఱిముఱి రమించు పురుషుఁడు
తఱుగును మఱి యెద్ది తగ నతనిదుఃఖంబున్. 36

కం॥ మొదలను విషము ట్లుండియుఁ
దుద కనుభవమందు నమృతతుల్యం బౌ నె
య్యది సాత్త్వికమౌఁ జు మ్మా
సదాత్మబుద్ధిప్రసాదజనితసుఖం బే. 37

కం॥ నలి నింద్రియవిషయంబుల
కలయికచే మొదల నమృతకల్పం బౌచుం
దలఁపఁగఁ దుద కలవిషముం
బలె నయ్యెడుతత్సుఖంబు మహి రాజస మౌ. 38

కం॥ నిదురను నాలస్యంబున
మదినిఁ బ్రమాదమునఁ బుట్టి మహి మోహమిడున్
మొదలఁ బిదప సమముగ నె
య్యది యాత్మకుఁ దామసంబ యాసుఖ మెల్లన్. 39

కం॥ ఆమాయవలనఁ బుట్టిన
యీమూఁడుగుణములఁ బడక యెసఁగెడుభూతం

జేమూలఁ గానఁ బడదు సు
మీ ముల్లోకములలో నమేయభుజబలా. 40

ఆ॥ వె॥ బ్రహ్మకులజులకును రాచకొలమువార
లకును మఱియు వైశ్యులకును శూద్రు
లకును బ్రకృతివలన లబ్ధమైనగుణాళిఁ
బట్టి కర్మములు విభక్తమయ్యె. 41

కం॥ శమము దమమ్ము దపము శౌ
చము నోరువు నార్జవంబు జ్ఞానము విజ్ఞా
నము నాస్తిక్యమ్ము స్వభా
వమునం గర్మంబు లయ్యె బ్రాహ్మణుల కిలన్. 42

కం॥ శూరత్వంబును దేజము
ధీరత దక్షత ప్రభుత్వధీ దానంబుం
బోరం బారమి రాజుల
కారయ స్వాభావికంబు లగు కర్మంబుల్. 43

తే॥ గీ॥ పొలముదున్నుట పసువులఁ గొలిచి కాఁపు
వర్తకముసేత యనునివి వైశ్యులకును
సమరఁ బరిచర్యరూపక మైనపనులు
పాండవా శూద్రులకును స్వాభావికములు. 44

కం॥ తనతనకర్మము కడు శ్ర
ద్ధను జేసినయట్టివాఁడు తగ సిద్ధిం బొం
దును బొందు నాతఁ డెట్లన
వినుపించెద నీకు నదియు విను భీభత్సూ. 45

ఉ॥ ఎవ్వనియిచ్ఛ భూతముల కెల్లఁ బ్రవృత్తి లభింప నయ్యెఁ దా
నెవ్వఁ డొకండ యీజగము లెల్లను నిండి వెలుంగు చుండువాఁ

డవ్విభు మానవుండు తనవాకులకర్మములెల్ల సేత య
న్నువ్వులఁ బూజసేసి తగఁ బొందఁగలండు కిరీటి సిద్ధినిన్. 46

చం॥ ధరణిని లెస్సచేయుపరధర్మముకంటెను బెద్దయున్ మహీ
ధరవరధైర్య మేలు నిజధర్మము తా గుణహీన మైనదే
నరయ నిజస్వభావజను లై తగుకర్మము లాచరించినన్
బురుషుఁడు నిశ్చయంబుగను బొందఁడు పాప మొకింత యేనియున్.

చం॥ అరయ స్వభావజన్యమగునట్టి సుకర్మము దోషయుక్త మై
పరఁగున యేని పార్థ విడువం దగ దెన్నఁడు దాని నెవ్వఁడుం
ధరణి సమస్తకర్మములు దథ్యము చుట్టికొనంబడెం గదే
దురితముచేత నగ్గి పొరి ధూమసమావృత మైనయట్లు గన్. 48

మ॥ తగులం బింతయు దేనియందునను బార్థా లేక యొప్పారుబు
ద్ధి గడుం గల్గి జితాత్ముఁడై తనదుహృత్సీమాంతరస్థాశలం
దగ నెల్లం దిగవిడ్చి కర్మఫలముల్ తథ్యంబుగాఁ గోరఁడై
నఁ గనంగాంచునరుండు తాఁ బరమ మానైష్కర్మ్యసిద్ధిం జుమీ.

మ॥ నర యారీతిని సిద్ధిఁబొందుపిదపం దద్బ్రహ్మముం జెందఁగాం
డెను వై యెయ్యది యొప్పుచుండు ధరలో నీ కింక నే నామహా
పరమాత్మప్రాప్తపుజ్ఞాననిష్ఠ నిదె క్లుప్తం బౌచు నొప్పారు నా
నరణిం దెల్పెద సావధానముగ వత్సా యాలకింపంగదే. 50

కం॥ తగ మాయారహితపుబు
ద్ధి గలిగి తనుఁ జేసికొనుచు ధృతిఁ దానే వ
శ్యుఁగ స్పర్శశబ్దరూపర
సగంధములు వలపు పగయుఁ జయ్యి విడుచుచున్. 51

కం॥ నిలుచుచు నేకాంతం బగు
స్థలి నలకలకగను గుడిచి తనువాఙ్మనముల్

గెలుచుచు విరాగి యై య
వ్వల నిత్యధ్యానయోగపరుఁ డై మిగులన్. 52

మ॥ పుడమి న్నేననుభావము న్విడిచి యుబ్బుం జేయుసామర్థ్యమున్
వెడదర్పంబు పరిగ్రహంబు మఱియుం ద్వేషంబు కామంబు నుం
బెడగాఁ ద్రోయుచు శాంతినిర్మమతలం జెంపొంది కౌంతేయ యె
వ్వఁడు తా నొప్పను బ్రహ్మభూయమునకు న్వాఁడేసమర్థుండుసూ.

ఉత్సాహ॥ చనఁగ బ్రహ్మభూతుఁ డిలఁ బ్రసన్నమైన యాత్మతోఁ
దనరి కోర్కి కుం దొకింత దాల్ప కెల్లప్రాణులన్
ఘనభుజాఢ్య తుల్యదృష్టిఁ గాంచి మిగులఁ బరమమై
తనరునట్టినాదుభక్తి తాను బడయఁగలఁడు సూ. 54

ఉత్సాహ॥ అనఘ తత్త్వముననునెవ్వఁడైనవాఁడ నెంతవాఁ
డను విశేషభక్తిచేఁ బుడమి నెఱుంగు నెవ్వఁడా
ఘనుఁడు తత్త్వ మెల్లెఱుంగుకారణంబుచేతనే
పొనర నన్నుఁ బొందుచుండుఁ బూరువంశబాలకా. 55

ఉత్సాహ॥ అనఘ నేనె యాశ్రయుండ నం చెడంద నమ్మి తా
ననిశ మెల్లకర్మజాల మాచరించునట్టివాఁ
డనయ మవ్యయంబు నిత్యమైనయట్టిమోక్షముం
జనఁగఁ బొందఁగాఁ గలండు సందియంబు లేదు సూ. 56

ఉత్సాహ॥ పొనర సర్వమైనకర్మముల వివేకబుద్ధితోఁ
డను సమర్పణంబు నీయెడంద నాకుఁ జేసి యీ
వనఘ మత్పరుండ వగుచు నధికబుద్ధియోగమున్
గని మనంబు నాపయిం దగంగ నిల్పు నిచ్చలున్. 57

ఉత్సాహ॥ ననపి మనము నాదుపయిన నాయనుగ్రహమ్ముచే
తను సమస్తదుర్గములను దాఁటఁగలవు కాక యీ

వనఘ "నేనయెంతిఁగినాఁడ" ననునహంకృతిం గటా
వినవ యేని నాదుబుద్ధి వేగ నీవు సెడుదు సూ. 58

ఉత్సాహ॥ అనయ మేన యెంతిఁగినాఁడ నని యహంకృతిం గటా
యనఘ నేను యుద్ధమాడ నంచు నిశ్చయింతు పో
మనమునందు వ్యర్థమగును మహాని నీదునిశ్చయం
బనయ మిప్రుడు నిన్నుఁ జేయునట్లు చేయుఁ బ్రకృతియే. 59

ఉత్సాహ॥ అనఘ నీస్వభావజన్య మాస్వకర్మగుణముచే
తను గరంబు కట్టువడితి తథ్య మీవు మోహమం
దినకతంబుచేత నేఁడు దేనిఁ జేయ నొల్ల వా
పని న చేయు దీవ సుమ్ము పార్థ నేఁ డవశ్యమున్. 60

కం॥ తెరపై బొమ్మలకిరియనీ
శ్వరుఁడు తనదు మాయచేతఁ బ్రాణుల నెల్లం
గర మాడించుచుఁ దద్భ్రు
త్సరసీరుహహీరమందు సమ్మతినుండున్. 61

కం॥ శరణు సొరు మీవు వానిన
భరతాన్వయబాల సర్వభావంబునఁ ద
త్పరమోప శాంతి శాశ్వత
పరమపదం బందఁగలవు వానికరుణచేన్. 62

ఆ॥ వె॥ ధర రహస్యములకుఁ బరమరహస్య మై
యొసఁగునట్టిజ్ఞాన మిట్లు నీకు
నెఱుఁగఁ జెప్పినాఁడ నెల్ల విమర్శించి
యెట్లు చేయ వలఁతొ యట్లు చేయు. 63

తే॥ గీ॥ సర్వగుహ్యాతమం బయి చనెడు నాదు
పరమవాక్యంబు మరలను పార్థ వినుము

యీావు పరమప్రియుండవై యొసఁగునట్టి
దానికతమునఁ జెప్పుదు హితంబు నీకు. 64

మత్తకోకిల॥ నన్నె మానసమందు నిల్పుము నాకె సేవ యొనర్పుమా
నన్నె గూర్చి నమస్కరింపుము నాకె పూజ యొనర్పుమా
నన్నె పొందఁగలాఁడ వింక ధనంజయా మది నమ్ముమా
అన్న నిక్కము బాసయిచ్చెద నైతి నాకుఁ బ్రియుండవే. 65

కం॥ నర సర్వధర్మములనుం
బరిత్యజించి శరణందుమా నన్నే నీ
యురుదోషంబులు పాచుచుఁ
బరిరక్షించెదను నిన్ను వగవకు మింకన్. 66

కం॥ కలిపితిని నేను నీకిది
యెఱుఁగఁ దపము భక్తి శ్రద్ధ యెవ్వియు నెవ్వా
డెఱుఁగఁ డెవఁడు నన్నొల్లం
డెఱిఁగింపఁగరాదు వాని కెన్నఁడు కర్ణా. 67

ఉత్సాహ॥ అరయఁ బరమ మారహస్య మైనయట్టి దీని నె
వ్వ రుపదేశ మాచరించువారు నాకు భక్తులై
పరఁగువారి కల్లవారు పరమభక్తి నాపయిం
గరము కలిగి నన్నుఁ బొందఁగలరు నిక్కువమ్ముసూ. 68

ఉత్సాహ॥ క్రీడి వారికంటె మిగులఁ బ్రియము చేయునట్టివాఁ
డేడఁ జూడఁ గాను నాకు నీమనుష్యకోటిలో
లేఁడు వారికంటె నోచె లీప్రియుండు పుట్టనుం
బోఁడు సువ్వె యింకమీఁద భూమిమీఁద నాకునున్. 69

కం॥ మనయిరువుర దగునీపా
వనసంవాదంబు ధర నెవఁడు భక్తిఁబఠిం

చును వాఁడు జ్ఞాన యజ్ఞం
బున నను( బూజించినట్టి పురుషుఁడ తలఁపన్. 70

కం॥ పుడమి మఱి యీసు లేకె
వ్వఁడు శ్రద్ధం దీని వినును వాఁడుం దగ ము
క్తుఁ డయి ఘనపుణ్యకర్ములు
వడసెడుశుభలోకములను బడయుం జుమ్మా. 71

కం॥ అనఘా యీశాస్త్రంబుం
బానరఁగ నేకాగ్రచిత్తముశ విం టే నీ
కును జ్ఞానము లేమిని బు
ట్టినయవివేకంబు నిను విడిచి చనెనొకో. 72

వ॥ ఇట్లుభగవంతుండు బోధించుటయు నర్జునుండు.

ఉత్సాహ॥ అనఘ యిపుడు నీయనుగ్రహమున నాదుమోహ మె
ల్లను నశించె మంచితెలివి లబ్ధ మయ్యె నామనం
బునను బొడమి యింతదాఁకఁ బొడుచుసందియములు వో
యెను మహాత్మ నీదుపంపు నింక నెమ్మిఁ జేసెదన్. 73

వ॥ అనిపల్కుత్యుత్తరంబిచ్చెనని చెప్పి సంజయుండు మరల ధృతరాష్ట్రునితో నిట్లనియె.

కం॥ అమరంగ వాసుదేవున
కు మహాత్ముండైన నరునకును నిటు సంవా
దము జరగఁగ నద్భుతగతి
ని మెయి గగుర్పొడువ వింటిని మహీనాథా. 74

తే॥ గీ॥ అఖిలయోగేశ్వరుం డైనయట్టి కృష్ణుఁ
డీపరమగుహ్యయోగం బిలేశ తనకుఁ
దాన చెప్పంగ నేను బ్రత్యక్షముగను

జక్కఁగా వింటి వ్యాసప్రసాదమునను. 75

కం॥ నరనాథ పావనాద్భుత
నరహరిసంవాద మిపుడు నామదిలోనన్
స్మరియించుచు స్మరియించుచుఁ
బోరిఁబోరి నానందమందుఁ బొదలుచు నుంటిన్. 76

కం॥ నరవర యద్భుత మగుత
ద్ధరి రూపమునుం దలంచి తలఁచి కరమ్మ
చ్చెరువుం బొందితి మఱియుం
బోరిఁబోరి నానందమందుఁ బొదలుచు నుంటిన్. 77

కం॥ ఎక్కడ విలుకాఁ డర్జునుఁ
డెక్కడ యోగేశ్వరుండు కృష్ణుండు గలం
డక్కడ లక్ష్మియు గెలుపును
నిక్కముగా భూతి నీతి నిలుచునటందున్. 78

గద్యము.

ఇది శ్రీత్రికవిమిత్ర తాడూరి రామనభట్టారకాగ్రపుత్ర పండితాలా
ధన మండిత లక్ష్మీనరసింహ పండిత ప్రణీతంబైన యుపనిషత్తు
ను బ్రహ్మవిద్యయును యోగశాస్త్రంబును శ్రీకృష్ణా
ర్జున సంవాదంబును నగు శ్రీభగవద్గీతయందు
మోక్షసన్యాసయోగంబను
నష్టాదశాధ్యాయము.
కృష్ణార్పణమస్తు.



